# ఆచార్యవైభవమ్

సహజమైన సర్వశేషిత్వమును కలవాడు, అందఱిచే ఆశ్రయింపతగినవాడు, లక్ష్మీనాథుడు, పరమకారుణికుడైన భగవానుడు జీవులందఱికిని **"కరణకళేబరైః ఘటయితుం దయమానమనాః"** (కరణములతో, శరీరముతో ఆత్మలను కలుపు టకు కరుణ జూపు మనస్సును కలవాడై) అను రీతిలో కరణకళేబరప్రదానమొనర్చి, పిమ్మట **'మానం ప్రదీప మివ కారుణికో దదాతి'** (కరుణా స్వభావుడైన భగవానుడు గొప్ప దీపమునువలె వేదశాస్త్రాదిప్రమాణమును ఇచ్చుచున్నాడు) అనునట్లు వేదరూప శాస్త్రమును అనుగ్రహించెను. **'తన్నై వణఙ్గ వైత్త కరణమివై'** (తనను నమస్కరించుటకై సృష్టించిన కరణములు ఇవి) అనురీతిలో వానిని సాధనములుగా గొని ఆ జీవులందఱు **"విచిత్రా దేహసంపత్తిః ఈశ్వరాయ నివేదితుమ్, పూర్వ మేవ కృతా బ్రహ్మన్! హస్తపాదాదిసంయుతా"** (బ్రహ్మదేవా! హస్తపాదాదులతో కూడిన విచిత్రమైన దేహసంపద భగవానుని సేవించుటకై పూర్వమే నిర్ణయింప బడినది) అను విధమున భగవానునకు సహజకైంకర్యవిధులను నిర్వర్తించవలసి యున్నది. కాని, పై ప్రదానములన్నియూ వ్యర్థములగుటచే **'అన్నాళ్ నీతన్ద ఆక్కైయిన్ వழி యుழల్వేన్'** (ఆనాడు నీవు ప్రసాదించిన శరీరముయొక్క మార్గమున అలమటించుచున్నాను) అను ప్రకారమున పుంశ్చలీభావముచే కల్గిన అభినివేశమును కలవారై, అతిక్రమించుటకు సాధ్యము కాని మాయాపిశాచిచే అనేకములైన అపదలను కలుగజేయు సంసారమను వికటమైన, మోసగించు యంత్రములో చిక్కుకొనినవారై, **"లూనపక్ష ఇవాండజః"** అనునట్లు ఱెక్కలు తెగిన పక్షులవలె, **'ఆవారార్ తుణై ఎన్ఱు'** అను రీతిలో మిక్కిలి ప్రబలమైన, ప్రతికూలమైన దిశలో వీచు గాలిచే విహ్వలులై, రక్షకుని కొఱకు ఎదురుచూచు నౌకాయాత్రికుల వలె, తమకెదురుగా ప్రజ్వలించు ఇంధనమును చేరు చీమలదండువలె, అంతట విస్తరించు స్వభావమును కల దావాగ్నిచే చుట్టబడిన లేళ్లగుంపువలె బాధపడుచున్న చేతనులను చూచి, వారిని ఉద్ధరింపవలెనను కోఱికతో ఆకులతను చెందినవాడైన భగవానుడు, **"కూపత్తిల్ వీழుమ్ కుழవియుడన్ కుదిత్తు అవ్వాపత్తై నీక్కు మన్ద అన్నైప్పోల్"** అను విధమున నూతిలో పడిన కుమారుని చూచిన తల్లి కళవళ పడుచు, అతనిని రక్షించుటకొఱకు తానే నూతిలోనికి స్వయముగా దిగు రీతిలో అవతరించి, ఈ పశుకీటతృణశకలసికతాకణములను అన్నిటిని తన చల్లని, తీయని, మిక్కిలి విశదములైన, అమృతమువంటి తన కటాక్షములతో, స్పర్శలతో, పలుకులతో ఉద్ధరించి, నిత్యమైన, నిరవద్యమైన (దోషము లేని) అంతు



లేని తన దాస్యమనెడి మహాసామ్రాజ్యమునందు వారిని అభిషిక్తులను చేయు రీతిలో అపుడపుడు సహజమైన కృపతో ఆత్మసాత్కృతులను చేయును.

**"పరాఽస్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ"** (ఇతని యొక్క శక్తి ఉత్కృష్టమైనది, అనేకవిధములైనది, స్వాభావికమైనది. జ్ఞానము, బలము, క్రియయును అట్టివే) అనుచు శ్రుతిచే కీర్తింపబడిన నిరతిశయమైన శక్తిని కలవాడైనను పరమపురుషుడైన భగవానుడు **'అన్ఱు శరాశరఙ్గళై వైకున్దత్తేఱ్ఱి'** అను విధమున తాను అవతరించిన సమయములో జనించిన చేతనా చేతనములను కొన్నిటిని మాత్రమే ఉజ్జీవింపచేయగల్గెను. అపుడు పుట్టనివార మగుటచే తనకు దుర్లభులమగు మనలను తరింపచేయుటకై, సజాతీయ మృగమును ప్రయోగించి ఆ జాతి మృగమును వేటగాడు పట్టుకొను రీతిలో, పరమపురుషుడు మానవుని రూపములో సదాచార్యుని భూమికను (రూపమును) గ్రహించినవాడై, అవతరించి అనుగ్రహించును. ఈ అంశమును **"సాక్షా న్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనూమ్, మగ్నా నుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా"**, (సాక్షాత్తు నారాయణుడు మానవరూపమును గ్రహించి, కరుణతో శాస్త్రమను హస్తముతో సంసారసముద్రమున మునిగినవారిని ఉద్ధరించు చున్నాడు) **"తేనార్ కమలత్తిరుమామగళ్ కొழునన్ తానే గురువాకి త్తన్నరుళాల్, మానిడర్కా ఇన్నిలత్తే తోన్ఱుదలాల్"** (తేనెను నిండుగా కల కమలములో వసించు లక్ష్మికి నాథుడు అగు భగవానుడు తన కరుణతో మానవులకొఱకు తానే గురువై ఈలోకమున అవతరించుటచే) మొదలగు ప్రమాణములు వెల్లడి చేయుచున్నవి. **"ఆచార్య స్స హరి స్సాక్షాత్ చరరూపీ న సంశయః"**, (ఆ ఆచార్యుడు సాక్షాత్తు జంగమరూపియైన భగవానుడే, సందేహము లేదు) **"ఆచార్యో బ్రహ్మణో మూర్తిః"**, (ఆచార్యుడు బ్రహ్మయొక్క రూపము) **"మమ స్వరూపం సర్వస్మాత్ పరస్య జగదీశితుః, షడ్విధం పరిపూర్ణం తత్ సేనేశ పరిపఠ్యతే, పరత్వం వ్యూహ విభవాంతర్యామిత్వ మేవ చ, అర్చా చార్యావతారా ద్వౌ షాడ్విధ్యం మే ప్రకీర్తితమ్"**, (సేనాధిపా! అందరికంటె గొప్పవాడనై, జగత్తుకు అధిపతినైయున్న నా పరిపూర్ణ స్వరూపము ఆఱు విధములుగా చెప్పబడుచున్నది, పరము, వ్యూహము, విభవము, అంతర్యామి, అర్చారూపము, ఆచార్యావతారము – అని ఆఱు విధములుగా నా రూపము కీర్తింపబడుచున్నది) **"గురుః గరీయాన్"**, (గొప్ప గురువు) **"గురు ర్గురుతమః"** (ఉత్కృష్టుడైన గురువు) అను మొదలగు ప్రమాణములును ఈ అంశమును స్పష్టీకరించుచున్నవి.

**"పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్, నాస్త్యకృతః కృతేన తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛేత్, సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్"**, **"తద్విద్ధి**

**ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా, ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః"** (తత్త్వద్రష్టలగు ఆ జ్ఞానులు నమస్కారముచే, పరిప్రశ్నచే, సేవచే ప్రసన్నులై, జ్ఞానమును ఉపదేశింతురు) అను మొదలగు ప్రమాణములవలన వేదాంత వేద్యు డైన పరమ పురుషుని స్వరూపమును సాక్షాత్కృతము గావించుకొనిన ఆచార్యుని ఆశ్రయింప వలసిన ఆవశ్యకత (అవధారణార్థము వలన తెలియుచున్నది) తెలియుచున్నవి. పై రెండు ప్రమాణములలో మొదటిది శ్రుతిప్రమాణము కాగా, రెండవది స్మృతి ప్రమాణము. ఈ రెండును పై అంశమును ఏకకంఠముగా పల్కినవి. **"శ్రుతిస్మృతీ మమైవాజ్ఞా"** అనునట్లు ఈ శ్రుతిస్మృతులు రెండును భగవదాజ్ఞారూపములే. వానిని అతిక్రమించువాడు **"య స్తా ముల్లంఘ్య వర్తతే ఆజ్ఞాచ్ఛేదీ మమ ద్రోహీ"** అనునట్లు భగవానుని ఆజ్ఞను మీఱినవాడు, ద్రోహమును చేసినవాడును అగును, కావున అట్టివాడు కంస – రావణ – సుయోధనాదులకు సబ్రహ్మచారియే యగును. **"అసతి బాధకే సర్వం వాక్యం సావధారణమ్"** (బాధ లేనప్పుడు వాక్యమంతయు అవధారణముతో కూడుకొన్నదిగా గ్రహింప వచ్చును) అను న్యాయమునుబట్టి, **"ఆచార్యవాన్ పురుషో వేద"** అను శ్రుతివాక్యము వలన ఆచార్యుని కల్గినవాడే పరబ్రహ్మను తెలిసికొనును – అను అర్థము (**"స గురుమేవాభి గచ్ఛేత్"** ఇత్యాది శ్రుతివాక్యములోని అవధారణార్థమునుబట్టి) స్ఫురించును. కావున, **'ఆచార్యో వేదసంపన్నో విష్ణుభక్తో విమత్సరః, మంత్రజ్ఞో మంత్రభక్తి శ్చ'** (ఆచార్యుడు వేదమును తెలిసినవాడు, విష్ణుభక్తుడు, అసూయ లేనివాడు, మంత్రమును తెలిసినవాడు, మంత్రమందు భక్తిని కలవాడుగా నుండవలెను) ఇత్యాదిగా చెప్పబడిన రీతిలో జ్ఞానానుష్ఠాన సంపన్నుడైన, సదాచార్యుని ఆశ్రయించినవానికే సమ్యక్ జ్ఞానము కల్గునని, లేనివానికి అట్టి ఫలము లభింపదనియు చెప్పనగును. **'తరతి శోక మాత్మవిత్',** (ఆత్మజ్ఞానము కలవాడు సంసారమును దాటును) **'బ్రహ్మవిదాప్నోతి పరమ్',** (బ్రహ్మనెరిగినవాడు ఉత్కృష్ట పదమును – పరమాత్మను పొందును) **'త మేవం విద్వాన్ అమృత ఇహ భవతి'** (ఆభగవానుని ఇట్లు తెలిసినవాడై మృత్యువు లేనివాడగును) ఇత్యాదిగా చెప్పబడిన రీతిలో బ్రహ్మజ్ఞానము మోక్షసాధనమని వేదములలో విధింపబడినను, ఆ జ్ఞానము ఆచార్యసదుపదేశమూలకము కానిచో దానికి సాధనత్వము లేదు. ఈ అంశమును భాగవతముకూడ **'త్వత్పాదపూతేన మహత్కృతేన'** ఇత్యాది సూక్తులద్వారా వ్యక్తము చేసినది. **"శ్రుతం హ్యేవ మే భగవద్దృశేభ్యః ఆచార్యా ద్ధైవ విద్యా విదితా సాధిష్ఠం ప్రాపత్"** అనునట్లు సదాచార్యునివలన పొందిన విద్యయే సాధుత మత్వమును పొందునను పరమార్థము శిష్టపరంపరలో శ్రద్ధాళువులైనవారివలన అనుగ్రహింప



బడుచున్నది కూడ. (**"స్వార్థానుమితిపరార్థానుమిత్యోః లింగపరామర్శ ఏవ కరణమ్"** అనుచూ పరామర్శజ్ఞానమే ద్వివిధానుమితులకు హేతువని, వ్యాప్తి జ్ఞానము కాదని పలుకుట గౌణమైనట్లే, సదాచార్యుని ఆశ్రయించినవానికే మోక్షము సిద్ధించునని, భగవానుని ఆశ్రయించుటచే మాత్రము సిద్ధింపదని పలుకుటయు గౌణమని చెప్పనగును. కావున **"ఉపాయోపేయత్వే తదిహ తత్త్వమ్"** (ఉపాయమై, ఉపేయమై ఉండుటయే నీ స్వరూపము) అని, **"మోక్ష మిచ్ఛేత్ జనార్దనాత్"** (జనార్దనునివలన మోక్షమును కోరవలెను) అనియు మొదలుగా గల ప్రమాణముల వలన ఏర్పడు భగవానుడొక్కడే మోక్షప్రదాత – అను సిద్ధాంతమునకు భంగము లేదు. మఱియు, **"ఆచార్యః స హరిస్సాక్షాత్ చరరూపీ న సంశయః"** ఇత్యాది ప్రమాణముల భావములు ఇచట అనుసంధేయము.)

**"కామం లోకప్రమాణస్య కామాః సిద్ధ్యంతి కామినః, గృహీతసద్వ్రదస్యైవ నిరపాయఫలోదయః"** అనునట్లు లౌకికఫలాభిసంధిని కల పురుషుడు లౌకికదృష్టిలో గమనించినపుడు అతనిచే నిర్వర్తింపబడు ఆయా వ్యాపారములు ఫలములను తృప్తిగా ఇచ్చినట్లు అతనికి కనుపింపవచ్చును; కాని, ఈ ఫలములు సాపాయ ములు. నిత్యనిరపాయమైన ఫలమును పొందవలెనను అభిలాషను కలవానికి సదాచార్యుని ఆశ్రయణమే శరణము. శాస్త్రములలో చక్కగా ఉపదేశింపబడినదై, అంగసహితమై, ఫలప్రదమైనదగు న్యాయవిద్యకూడ లోకశాస్త్రపరిశీలనముచే చక్కగా తెలియబడినదైనను, **"వినా సదుపదేశతః"** అను రీతిలో సద్గురునిచే ఉపదేశింప బడక పోయినచో ఫల ప్రదము కానేరదు; ప్రసన్నము కాదు. **"జ్ఞానత స్త్వనుపేతస్య బ్రహ్మచర్య మభీప్సతః, వృథైవాత్మసమిత్క్షేపో జాయతే కృష్ణవర్త్మని"** అనునట్లు ఆచార్యుని ఆశ్రయింపకనే, తన జ్ఞానముతోనే బ్రహ్మజ్ఞానమును పొందగోరువాని ఆత్మసమర్పణము ఉపనయనము కానివాడు చేయు సమిదాధానమువలె, నిరర్థకము – అని పాంచరాత్రతంత్రమున నిరూపింపబడినది. **"నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన, య మేవైష వృణుతే తేన లభ్యః, తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్మ్ స్వామ్"** అను ఈ శ్రుతి ఒకచోట భక్తిప్రాధాన్యపరముగా, మరియొక చోట భగవద్విషయీకార పరముగా రెండు విధములుగా నిర్వహింప బడినను, పైన తెలుపబడిన ఉపబృంహణ–వచనస్వారస్యమునుబట్టి, **"యమేవా చార్యం ఏష చేతనో వృణుతే, తేన ఆచార్యేణ స పరమః పుమాన్ లభ్యః"** అను అర్థమునుకూడ పై శ్రుతికి పెద్దలు నిర్ణయించిరి. ఈ శ్రుతిలోని **"తేన"** అను పదములోని తృతీయా విభక్తికి **"అసినా ఛ్ఛేద్యః"** అను ప్రయోగములోవలె కరణార్థమును ప్రకరణమును బట్టి చెప్పనగును.

**"పాపిష్ఠః క్షత్రబంధు శ్చ పుండరీక శ్చ పుణ్యకృత్, ఆచార్యవత్తయా ముక్తౌ తస్మాదాచార్యవాన్ భవేత్"** (పాపిష్ఠుడగు క్షత్రబంధువు, పుణ్యాత్ముడగు పుండరీకుడును ఆచార్యసంబంధముచేతనే ముక్తులయ్యిరి. కావున ఆచార్యుని కలవాడుగా కావలయును) అను ప్రమాణము సదాచార్యసమాశ్రయణము సుకృతమును చేసినవానికి, పాపమును చేసినవానికిని – ఇద్దఱికిని అవశ్యము కర్తవ్యమనుటను బోధించును. **"చరమస్యావతారస్య గురురూపేణ మే సదా, ప్రాప్యత్వప్రాపకత్వే ద్వే స్వనిష్ఠేన గుణాన్వితే"** అను సూక్తి భగవానుడు ఉపాయమును, ఉపేయము అయినట్లే, ఆ భగవానుని అవతారమగు ఆచార్యుడును ఉపాయము, ఉపేయమును అగును– అనుటను తెలుపును. అంతియే కాక, పర–వ్యూహ–విభవ–అంతర్యామి–అర్చా–ఆచార్యరూపము లనెడి ఆఱు విధములగు భగవదవతారములయందు **"పూర్వస్మాదపి పూర్వస్మాత్ సులభో హ్యుత్తరోత్తరః"** అను ప్రమాణవచనమునుబట్టి ఉత్తరోత్తరము ఒకదాని కంటె వేఱొకదానికి సౌలభ్యము అధికము అనియు ఏర్పడుచున్నది. ఇట్లు చివరిది అగు ఈ ఆచార్యావతారమునందు సౌలభ్యము అతిశయించి యుండు ననుటను **"ఆసన్నత్వాద్దయాలుత్వాత్ జ్ఞానిత్వాత్ గురుభావతః"** (సమీపమున నుండుటచే, దయాస్వభావుడగుటచే, జ్ఞానియగుటచే, గురువు అగుటచే) అను సూక్తి సద్ధేతుప్రదర్శనముద్వారా స్పష్టము చేయుచున్నది. కావున **"తస్మాత్ తత్పాద యుగళం శరణం మోక్షకాంక్షిణామ్"** (కావున మోక్షమును పొందగోరువారికి ఆ ఆచార్య పాదద్వంద్వమే శరణము) అనునట్లు మోక్షార్థులకు ఆచార్య శ్రీపాద యుగళమే శరణము. అట్లు ఆచార్యుని పాదసమాశ్రయణమును చేయనివానిని చూచినచో, నీటినుండి వేఱయిన తామరను సూర్యుడు శోషింప చేయునట్లు, కరుణాళువగు భగవానుడును అనుగ్రహింపడు. **"నారాయణోఽపి వికృతిం యాతి గురోః ప్రచ్యుతస్య దుర్బుద్ధేః, కమలం జలాదపేతం శోషయతి రవిః న తోషయతి"**, **"ఎన్నుమనైత్తుయిల్కు మీరమ్‌శెయ్ నారణనుమ్ అన్నుమ్ తన్నారియన్ పాలన్బొழி యిల్, నిన్నపునల్‌పిఱన్ద పఙ్గయత్తై పొఙ్గుశుడర్ వెయ్యోన్ అనలుమిழ்న్దు తానులర్త్తి యఱ్ఱు"** అను సూక్తులు పైఅర్థమును తెలుపుటయే కాక, ప్రత్యవాయముకూడ సంభవించుననియు సోదాహరణముగ పల్కుచున్నవి. ఈ అంశమును **"పొయ్యి లాద"** శ్రీమణవాళ మహామునులు ఉపదేశరత్తినమాలై అను ప్రబంధములో **"ఞానమనుట్టానమివై నన్హాకవే యుడైయనాన గురువైయడైన్దక్కాల్, మానిలత్తీర్! తేనార్ కమలత్తిరుమామకళ్ కొழுనన్ తానే వైకున్దమ్ తరుమ్"** (ఓ జనులారా! జ్ఞానము, అనుష్ఠానములను బాగుగా కల ఆచార్యుని ఆశ్రయించినచో లక్ష్మీనాథుడు స్వయముగా వైకుంఠమును ప్రసాదించును) **"తన్**



**గురువిన్ తాళిణైకళ్‌దన్నిల్ అన్బొన్ఱిల్లాదార్ అన్బుతన్బాల్ శెయ్‌దాలుమ్ అమ్బుయకోన్ ఇన్బమికు విణ్ణాడు తానళిక్కవేణ్డియిరాన్"** (గురువు పాదములందు భక్తి లేనివాడు తనయందు భక్తిని కలవాడైనను, వానికి భగవానుడు ఆనందముతో నిండిన పరమపదమును అనుగ్రహించుటకు ఇష్టపడడు) అనుచు అన్వయవ్యతిరేక ముఖముగా పల్కిరి కదా. సదాచార్యసమాశ్రయణమువలన ఆశ్రయించినవానికేకాక, అతనికి ముందు, పిమ్మట జన్మించినవారును తరింతురనుటను, పొందుటకు సాధ్యము కాని ముక్తిఫలము చేతికందునంత ఎత్తులో సులభమగుననుటయును **"అన్వయా దపి చైకస్య సమ్యక్ న్యస్తాత్మనో హరౌ, సర్వ ఏవ ప్రముచ్యేరన్ నరాః పూర్వే పరే తథా"**, (భగవానుని పట్ల చక్కగా ప్రపత్తిచేసినవానిని ఒక్కనియొక్క సంబంధముచే అతనికి ముందువారు, వెనుకవారును అందరూ ముక్తులగుదురు), **"భుంక్తేభోగా నవిదితనృపః సేవకస్యార్భకాదిః పంగు ర్నౌకాకుహరనిహితో నీయతే నావికేన"**, (రాజసేవకుని కుమారుడు ప్రభువును తెలియనివాడైనను ఆ ప్రభువు తన తండ్రికి ఇచ్చిన సంపదను అనుభవించును. ఓడయందున్న కుంటివాడు నావికుని తెలికయక పోయినను వానిచే తీసికొని పోబడుచున్నాడు), **"ఆస్ఫోటయంతి పితరః ప్రనృత్యంతి పితామహాః, వైష్ణవో నః కులే జాతః స నః సంతారయిష్యతి"** (విష్ణు భక్తుడు మన వంశములో జన్మించినాడు అతడు మనలను ఉజ్జీవింపచేయును) అని పితృదేవతలు సంతోషముతో భుజములను చఱచుకొందురు. పితామహ వర్గము నాట్యము చేయుదురు) ఇత్యాది ప్రమాణములు తెలుపుచున్నవి. **"బాలమూకజడాంధా శ్చ పంగవో బధిరా స్తథా, సదాచార్యేణ సందృష్టాః ప్రాప్నువంతి పరాం గతిమ్"** (బాలురు, మూగవారు, జ్ఞానములేనివారు, గుడ్డివారు, కుంటివారు, చెవిటివారుకూడ సదాచార్యునిచే కటాక్షింపబడినవారై ఉత్తమగతిని పొందు చున్నారు) అని, **"పశు ర్మనుష్యః పక్షీ వా యే చ వైష్ణవసంశ్రయాః, తేనైవ తే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమం పదమ్"** (పశువు కాని, మనుష్యుడు కాని, పక్షికాని వైష్ణవుని ఆశ్రయించినవారైనచో, అతనిచేతనే వారు భగవానుని పరమపదమును చేరగలరు) అనియుగల ప్రమాణములు సదాచార్యసంశ్రయణము సకలచేతనాచేతనములకు పరమపదమును పొందించు ననుటను తెలియజేయుచున్నవి.

భగవానునకు సర్వకాల – సర్వావస్థలలో అశేషమైన, శేషత్వానుగుణమైన కైంకర్యమును చేయు మహనీయులతో అన్వయము పొందుట మందజనులకు దుర్లభము అనుటను – **"తవ దాస్యసుఖైకసంగినాం భవనేష్వస్త్వపి కీటజన్మ మే"** (నీ దాస్యసుఖమందే ఆసక్తిని కలవారి భవనములందు కీటజన్మయైనను నాకు కలుగు గాక!) ఇత్యాదిసూక్తులు విదితము చేయుచున్నవి. **"ప్రణామః కీర్తనం వాఽపి స్మరణం వాఽ**

**పి కేవలమ్, ఏకైక మపి చాంగానాం ప్రపత్తిః ప్రాజ్ఞసంశ్రయాత్"** అను సూక్తినిబట్టి సదాచార్యుని ఆశ్రయించినవాడు ఆ ఆశ్రయణమహిమవలన కాయిక – మానసిక– వాచిక ప్రపత్తులలో ఏకదేశములగు ప్రణామ కీర్తన– స్మరణములలో ఏ ఒక్కటిని ఆచరించినను, అది సమగ్రప్రపత్తిగానే పరిణమించును – అని ఏర్పడుచున్నది. అట్లే, సదాచార్యాభిమానమే ఉత్తారకమనుట – **"గురుణా యోఽభిమన్యేత గురుం వా యోఽభిమన్యతే, తా వుభౌ పరమాం సిద్ధిం నియమా దుపగచ్ఛతః"**, (గురువుచే అభిమానింపబడువాడు, గురువును అభిమానించువాడు – వీరిద్దరు తప్పక గొప్ప సిద్ధిని పొందుదురు), **"ఆచార్యస్య ప్రసాదేన మమ సర్వ మభీప్సితమ్, ప్రాప్నుయా మితి విశ్వాసో యస్యాస్తి స సుఖీ భవేత్"** (ఆచార్యుని అనుగ్రహముచే నేను కోరినదంతయు పొందుదును – అను విశ్వాసము ఎవనికి కలదో అతడు సుఖమును కలవాడగును) ఇత్యాదులు వెల్లడిచేయుచున్నవి. అట్లే, **"య స్త్వాం ద్వేష్టి స మాం ద్వేష్టి, య స్త్వా మను స మా మను"** (నిన్ను ఎవడు ద్వేషించునో, అతడు నన్నుకూడ ద్వేషించుచున్నాడు, నిన్ను ఎవడు అభిమానించునో అతడు నన్నుకూడ అభిమానించు చున్నాడు) అని, **"పాండవాన్ ద్విషసే రాజన్! మమ ప్రాణా హి పాండవాః"** (రాజా! పాండవులను ద్వేషించుచున్నావు. పాండవులు నా ప్రాణములు) అని, **"మమ మద్భక్తభక్తేషు ప్రీతి రభ్యధికా భవేత్"** (నా భక్తుల భక్తులయందే ప్రీతి నాకు మిక్కుటముగా నుండును) అనియును గల ప్రమాణములు తనయందు భక్తిని కలవారి విషయములో కంటె, తన భక్తులకు భక్తులైనవారి విషయమున తనకు గల ప్రీతి అతిశయించి యుండునని సాక్షాత్తు భగవానుడే తెలిపినట్లు సుస్పష్టము గావించు చున్నవి. ఇందు వలన మోక్షప్రాప్తిని కోరు చేతనులకు తప్పక సదాచార్యాశ్రయణము అవశ్యకర్తవ్యము.

ఈ గొప్పదైన పరమార్థమును సోపాధికమాతా పితృసహస్రములకంటె మిక్కిలి వాత్సల్యమును కల, యథార్థమును వచించు వేదరూపశాస్త్రము చేతులెత్తి ఘోషించు చున్నది. సాక్షాత్తు భగవానుడు శ్రీరామ, శ్రీకృష్ణాది రూపములలో అవతరించినపుడు వశిష్ఠ, సాందీపన్యాదులను ఆశ్రయించుటద్వారా ఇట్టి క్రమమును స్వయముగా ఆచరించి చూపెను కదా!

**"తస్మిన్నస్తమితే భీష్మే కౌరవాణాం ధురంధరే, జ్ఞానాన్యల్పీభవిష్యంతి"** (కౌరవులలో గొప్పవాడగు భీష్ముడు అస్తమించినచో జ్ఞానము తరిగిపోవును) అనుచు శ్రీకృష్ణ భగవానునిచే ప్రజ్ఞాసముద్రునిగా పొగడబడిన భీష్ముడు – **"జ్ఞానవృద్ధా మయా రాజన్! బహవః పర్యుపాసితాః"** (రాజా! జ్ఞానముచే గొప్పవారగు పలువురు నాచే చక్కగా



ఆరాధింపబడిరి) అనుచు తాను పలువురు జ్ఞానులను ఉపాసించిన భాగ్యశాలిననెను. త్రైవిద్యజనమూర్ధన్యులగు అస్మదాచార్యవర్యులచే కూడ ఈ క్రమము పరంపరగా పాటింపబడుటకంటె వేఱొక ఉత్తమప్రమాణము ఏమి కావలయును?

**'అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్తవిచికిత్సా వా స్యాత్, అలూక్షా ధర్మకామాః స్యుః యథా తే తత్ర వర్తేరన్ తథా తత్ర వర్తేథాః'** (చేయు కర్మల యందు కాని, ఆచారములందు గాని సందేహము కలిగినచో అసూయ లేనివారు, ధర్మతత్పరులును అగువారు ఏ యే విషయములయందు ఎట్లు ప్రవర్తింతురో ఆయా విషయములందు అట్లే ప్రవర్తింపవలెను), **"యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః, స యత్ ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే"**, (గొప్పవాడు వేనిని, వేనిని ఎంతవరకు ఆచరించునో, లోకములోనివారుకూడ వానిని, వానిని అంతవరకే ఆచరింతురు) **"మహాజనో యేన గతః స పంథాః"**, (గొప్పవారు అనుసరించినదే మార్గము), **"వేదశాస్త్రరథారూఢాః జ్ఞానఖడ్గధరా ద్విజాః, క్రీడార్థ మపి యద్బ్రూయుః స ధర్మః పరమో మతః"** (వేదరూప శాస్త్రమను రథమును ఎక్కినవారు, జ్ఞానమను ఖడ్గమును దాల్చినవారును అగు ద్విజులు విలాసము కొరకు అయినను పల్కినది గొప్ప ధర్మమగుట సమ్మతము), **"వాసుదేవం ప్రపన్నానాం యాన్యేవ చరితాని వై, తాన్యేవ ధర్మశాస్త్రాణీత్యేవం వేదవిదో విదుః"** (వాసుదేవుని ఆశ్రయించినవారి అనుష్ఠానములు ఏవి కలవో, అవి ధర్మశాస్త్రము లని వేదములు తెలిసిన గొప్పవారు తలంతురు), **"వేదోఽఖిలో ధర్మమూలమ్, స్మృతిశీలే చ తద్విదామ్", "ఆచార శ్చైవ సాధూనామ్"** (మంచివారి ఆచారము లును), **"సువ్యాహృతాని మహతాం సుకృతాని తత స్తతః, సంచిన్వన్ ధీర ఆసీత"** (గొప్పవారి సూక్తులను, సత్కార్యములను తెలిసికొని ధీరుడై ఉండవలెను), **"ధర్మజ్ఞ సమయః ప్రమాణం వేదా శ్చ"** (ధర్మజ్ఞుల ఆచారము, వేదములును ప్రమాణములు), **"అల్లిమలర్ప్పావైక్కన్బరడికన్బర్ శొల్లుమ్ అవిడు శురుదియామ్"** (లక్ష్మీనాథుని దాసులకు దాసులు పల్కు క్రీడావచనములు కూడా శ్రుతులే యగును) ఇత్యాది ప్రమాణములు మహాత్ముల ఆచరణమే పరమప్రమాణ మనుటను తెలుపుచున్నవి.

ఆచార్యుని ఆశ్రయించు అధికారులు రెండు విధములుగా నుందురు. వారిలో మొదటి వర్గమునకు చెందినవారు, తమ ఆచార్యుల ఉపదేశమును అనుసరించి, భగవానునకు అత్యంతము పరతంత్రులైయుండుటలోనే ప్రావణ్య మును కలవారై, **"మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతిః నారాయణః"** (నారాయణుడు తల్లి, తండ్రి, సోదరుడు, నివాసము, శరణము, స్నేహితుడు, ఉపాయమును) అని,

**“వాసుదేవ స్సర్వమ్”** (అంతయు వాసుదేవుడే) అని, **“ఎల్లామ్ కణ్ణన్”** (అంతయూ కృష్ణుడే) అనియును మొక్కవోని విశ్వాసమును కలవారై, ప్రథమ పర్వమున నిలచినవారై పరాంకుశ – పరకాలాది దివ్యసూరులవలె ప్రకాశించుచుందురు.

ఇక, రెండవ వర్గమునకు చెందినవారు, సదాచార్యుల ఉపకారవైలక్షణ్యమును నిరంతరము ధ్యానించుచు, తద్వశంవదహృదయులై, పరమవిలక్షణమైన, గొప్ప విలువను కల్గిన, అతిదుర్లభమైన వస్తువును (భగవానుని సేవను) నిరుపాధికకృపతో తాము పొందునట్లుచేయు ఆచార్యులపట్ల ప్రత్యుపకృతిని చేయుట తమ ఆకించన్య కారణముగా సాధ్యము కాకుండుటను లెక్కించుచు, **“మాతా పితా యువతయ స్తనయా విభూతిః సర్వం యదేవ నియమేన”** (తల్లి, తండ్రి, భార్య, తనయులు, సంపద, మిగిలినదంతయు నియమముగా ఎవని పాదములో) అనునట్లు “ఆచార్యులే సమస్తము” అని నిశ్చయించుకొనినవారై, మధురకవి మొదలగువారివలె అనాఘ్రాతములైన విషయాయాంతరములను కలవారై (ఆచార్యుని తప్ప వేఱొక విషయమును భావింపనివారై), ఆ ఆచార్యునికంటె వేఱొక దైవమును భజించుటలో దవిష్ఠులై, **“దేవ మివ ఆచార్య ముపాసీత”** (ఆచార్యుని భగవానునివలె సేవింపవలెను) అను శ్రుతిలో బోధింపబడిన అర్థమును యథార్థ మొనర్చినవారై, చరమపర్వమునందు నిలచి యుందురు. ఇచట ఉదాహరింపబడిన శ్రుతిలో ఆచార్యునకు భగవానునితో సాదృశ్యమును కల్పించుట విభూతిద్వయమందును అంతకంటె వేఱొక, ఉపాసింపతగిన ఉత్కృష్టవస్తువు లేకుండుట చేతనేనని బహుశ్రుతులు నిర్ణయించిరి. పూర్వజన్మకృతమైన దుష్టసంస్కార ప్రభావముచే లౌకిక సుఖములయందు అభిరుచిని కల చేతనులు చెడ్డదారిలో పరుగులు తీయుటను చూచిన వేదవేద్యుడగు భగవానుడు, వారి వారి అభిరుచులను గమనించి, **‘తత్రోపేక్ష్య తతోఽనుమత్య’** అను రీతిలో ఉపేక్షించి, వారి అభిమతములను అనుమతించి, వారు చేయు ఆయాకర్మల కనుగుణములైన ఫలములను ఇచ్చును. **“సర్వస్య వశీ సర్వస్యేశానః”** అని వేదములో నిరతిశయమైన స్వాతంత్ర్యమును కలవాడుగా పొగడబడిన స్వామి శాస్త్రవశ్యులై, సత్కర్మలను చేయు అధికారులకు తన కైంకర్యమును ప్రసాదించును. ఆ శాస్త్రమును అతిక్రమించినవారిని తన లీలలకు విషయముగ చేయును. కావున భగవానుని సాక్షాత్తు ఆశ్రయించినవారు ఫలసిద్ధి కలుగునంతవరకు నిర్భయముగా నుందురని చెప్ప వీలుకాదు. కాని, భగవదత్యంతపరతంత్రతనే స్వరూపముగా కల్గియుండుటచే నిగ్రహమను దానిని తెలియనివాడు, అనుగ్రహస్వరూపుడగు సదాచార్యుడు తన నిత్యసాన్నిధ్యముచే, తనను ఆశ్రయించినవారు భగవానుని ముఖవికాసమునకు



అడ్డు తగులు పనులను చేయకుండ జాగ్రత్తపడును. కావున సదాచార్యుని ఆశ్రయించిన వారి ఫలోపలబ్ధి ఐకాంతికము. అనగా తప్పకకల్గును. కావుననే **“సిద్ధి ర్భవతి వా నేతి సంశయోఽచ్యుతసేవినామ్, న సంశయోఽస్తి తద్భక్తపరిచర్యారతాత్మనామ్”** (భగవానుని సేవించువారికి సిద్ధి కలుగునా? కలుగదా? అను సంశయము కలుగ వచ్చును. కాని భగవానుని భక్తులను సేవించుటలో ఆసక్తిని కలవారికి ఇట్టి సందేహము లేదు) అని, **“న్యగ్రోధబీజే వటవత్ ప్రణవే శబ్దజాలవత్, సిద్ధే తదీయశేషత్వే సర్వార్థాః సంభవంతి హి”** (ఆ భగవానుని శేషమగుట సిద్ధించినచో, మఱ్ఱివిత్తనములో మఱ్ఱిచెట్టువలె, ప్రణవములోశబ్దరాశివలె సర్వార్థములును సమకూరును) అనియు తెలుపబడినది.

ఇచట ఒక సందేహము పొడముటకు అవకాశము కలదు. **“సాక్షా న్నారాయణో దేవః”** అను మొదలగు సూక్తులచే ఆచార్యుడు సాక్షాత్తు భగవానుడుగా తెలుపబడినాడు. మఱల వేఱొక ప్రమాణములో **“సిద్ధే తదీయశేషత్వే”** అనుచు తదీయాత్మకుడుగా అభివర్ణింపబడినాడు. ఇట్లు తెలుపబడిన అభేదము, భేదాత్మకమను ధర్మములు రెండును పరస్పరవిరుద్ధములు కదా! ఇవి ఒక చోట ఉండుట ఎట్లు సాధ్యము?” అనునది ఆ సందేహము. అభిజ్ఞులు దీనినిట్లు సమాధానించిరి. **‘సితాక్షీరన్యాయేన సజ్గమితాఙ్గకమ్’** అని శ్రీ పరాశరభట్టరు శ్రీరంగరాజస్తవమున పల్కిన రీతిలో శర్కరా దుగ్ధన్యాయముచే (పాలు – చక్కెరల కలయికవలె) మనోహరముగా కలిసిన నరత్వ – హరిత్వ భాసురమైన అద్భుతమగు ఒకానొక (నరసింహరూప) దైవమువలె, ఆ ఆచార్యరూపమును కేవలము భగవత్స్వరూపము కాదు. లేక, కేవలము పరిశుద్ధాత్మస్వరూపమును కాదు. ఇక ఏమనగా – అందమైన ఈ రెండిటి కలయికయే. అట్లుకాక, కేవలము భగవత్స్వరూప మేనని అన్నచో, గురుపరంపర అంతయు ఒకటే కావలసివచ్చును. కావున స్వరూపైక్యమను దోషము సంభవించును. ఇక, పరిశుద్ధాత్మస్వరూపమే అందుమా, **(సాక్షాన్నారాయణో హి సః ఇత్యాది)** అనేక ప్రమాణములకు జలతర్పణము చేయవలసివచ్చును (నిరర్థకములగును). అందుచే ఆధేయత్వము, విధేయత్వము, శేషత్వములను లక్షణముగా (ముఖ్యముగా) కల పరమైకాంతి విలక్షణమైన ఆత్మను, బాగుగా కాచబడిన ఇనుపగుండువలె, బయటకు మిక్కిలి వెలుగుచు, అధిష్ఠించియున్న, విలక్షణాత్మవిశిష్టమైన భగవత్స్వరూపమని గ్రహింపనగును. (శ్రీవచనభూషణ వ్యాఖ్యానమునకు అరుమ్బదమును అనుగ్ర హించిన అణ్ణావప్పఙ్గార్ ‘అయో దహతి’ ఇత్యాది వ్యవహారమును ఉదాహరణముగ చూపి ఈ విషయమును సమర్థించుట ఇచట స్మరింపదగినది.) కావున ఇదియును ఒక విశిష్టాద్వైతమే. **“విశేషణభేదాత్

**విశిష్టభేదః"** అను న్యాయము చొప్పున భగవత్స్వరూపమునకు, ఆచార్యస్వరూపమునకు మధ్య విశేష్య – విశేషణ రూపభేదము కలదు. (భగవానుడు విశేష్యము, ఆచార్యుడు విశేషణము). విశేషణరూపుడైన ఆచార్యునిద్వారా భేదము, విశేష్యరూపుడైన భగవానుని ద్వారా అభేదమును ఉద్భావింపబడుచుండుటచే భేదాభేదములకు ఏకాధికరణత్వ దోషము – అనగా – భేదము. అభేదము రెండును ఒక చోటనే ఉండుట – అను దోషము లేదు. (ఇందువలన గురుపరంపరయొక్క ఏకీభావదోషము, ఆచార్యుడు సాక్షాత్తు భగవానుడను పలు ప్రమాణములు నిరర్థకములగునను దోషమును పరిహరింపబడినవి.)

ఈ ఆచార్యశబ్దము భగవద్రామానుజులయందే ముఖ్యవృత్తిని కల్గినది. మిగిలిన తత్పూర్వ – తదనంతర ఆచార్యవర్గము అంతయు ఆ స్వామి శిరస్సుయొక్క, పాదముయొక్క ప్రతీకగా భావింపబడుటచే శేషత్వమును కల్గియున్నది. **"తస్మిన్ రామానుజార్యే గురు రితి చ పదం భాతి, నాన్యత్ర, తస్మాత్ శిష్టం శ్రీమద్గురూణాం కుల మిద మఖిలం తస్య నాథస్య శేషః"** (ఆ రామానుజాచార్యులవారి యందే గురువు అను పదము ప్రకాశించుచున్నది. వేరొకరియందు కాదు. మిగిలిన ఆచార్యవర్గము అంతయు ఆస్వామికి శేషము) అని కదా ఘోషింపబడుచున్నది.

**"యతిరాజేన నిబద్ధనాయకశ్రీః"** అనునట్లు గురుహార యష్టికినాయకమణిగా (తరళముగా) వెల్గొందు ఈ మహనీయుల మహిమను ప్రస్తుతించుట సూర్యునకు దివ్వెటీ పట్టుటవంటిది అగును. అయినను కొన్ని మధురములైన పూర్వాచార్య సూక్తులు ఇచట ప్రస్తుతింపబడుచున్నవి. సోమాశియాణ్డాన్ అను ఆచార్యులు గురుగుణవివరణము అను గ్రంథములో **"ఆచార్యత్వపదం తథైవ గురుతా యోగక్రమాదాగతే జ్ఞానాభావతమోనివృత్తికరణశ్రుత్యర్థనిష్ఠాపనాత్, కారుణ్యైకనిధౌ భవాబ్ధితరణప్రాబోధకోత్తారకే శ్రీమల్లక్ష్మణయోగిని వ్యవసితే నాన్యేషు మాన్యేష్వపి"** (యోగక్రమానుసారము అర్థము చెప్పునపుడు అజ్ఞానమను అంధకారమును పోగొట్టుటచే, వేదార్థములను స్థిరపరచుటచే సిద్ధించు ఆచార్యపదవియు, ఆచార్యత్వ మును కరుణకు అద్వితీయమైన నిధి, సంసారమును దాటించు ఉత్తారకులను అయిన శ్రీరామానుజాచార్యుల వారియందు మాత్రమే అన్వయించుచున్నవి. మిగిలిన వారు ఎంత గొప్పవారైనను వారియందు ఇవి అన్వయింపవు) అని, **"ఏవం సర్వప్రకార గురులక్షణపూర్ణచరమగురురూప భగవదవతారరామానుజగురో రభిమాన ఏవ ఆత్మోజ్జీవనాపేక్షాణా మఖిలచేత నానాం సంసారనిరయగర్తనిస్తరణోపాయః,**



**తద్వ్యతిరిక్తపూర్వాపర గురుజనానామ్ ఉపకారకత్వ మేవ, నతూద్ధారకత్వమ్, తే పునః అస్య సంసారిచేతనస్య ఆత్మహితైషిణః ప్రథమతో అస్మచ్ఛేషిణః పరమకారుణికస్య అపరిమితోదారభావస్య భగవతః శ్రీరామానుజగురోః వైభవ ముపదిశ్య తస్యాభిమాన ఏవ సంసృతినిస్తరణో పాయః, తద్గుణానుసంధాన మేవ కాలక్షేపవిషయ ఇతి జ్ఞాపయిత్వా తద్ద్వారా చేతనస్య పరమోపకర్తారో భవంతి"** (ఈ విధముగా అన్ని విధములైన గురులక్షణ ములు నిండుగా కల చరమగురురూపమగు, భగవానుని అవతారవిశేషమై యుండు రామానుజాచార్యులవారి అభిమానమే ఆత్మోజ్జీవనమును కోరు అందరి జీవులకును సంసారమను నరకకూపమునుండి దరికి చేరు ఉపాయము. వారికి ముందు వెనుకగల మిగిలిన ఆచార్యులకు ఉపకారకత్వమే తప్ప ఉత్తారకత్వము లేదు. వారు ఈ సంసారిచేతనుల మంచిని కోరువారై, మొట్టమొదట మనకు స్వామియై, పరమకారుణికులై, అంతులేని ఔదార్యమును సహజముగా కల భగవానులగు రామానుజాచార్యులవారి గొప్పతనమును ఉపదేశించి, వారి అభిమానమే సంసారసముద్రమును దాటుటకు ఉపాయమని, వారి గుణాను సంధానమే కాలక్షేమునకు విషయమని తెలిపి, తద్ద్వారా చేతనులకు గొప్ప ఉపకారమును చేయుచున్నారు) అని ఆ ఆచార్యులే అదే గ్రంథమునందు పల్కుట, **"సత్యం సత్యం పున స్సత్యం యతిరాజో జగద్గురుః, స ఏవ సర్వలోకానా ముద్ధర్తా నాత్ర సంశయః"** (మూడు సార్లు ప్రమాణము చేసి పల్కుచున్నాను. రామానుజులే లోకమునకు గురువు. లోకములనన్నిటిని ఉద్ధరింపగల్గినవారు. ఇందు సందేహము లేదు) అని కణియనూర్ శిఱియాచ్చాన్ అను ఆచార్యులు శ్రీరంగనాథుని సన్నిధిలో సచేలస్నానపూర్వకముగా శపథమును చేయుట, **"ఆచార్యత్వ ముపాయతాత్మక మహో రామానుజార్యే గురౌ నాన్యేష్వార్యవరేషు, తే యతివరాధీనాత్మసత్తాః యతః, తస్మాదార్యపరంపరాశ్రిత పదాంభోజస్య పాదాశ్రయః కర్తవ్యః స్వహితైషిభిః కిల జనైః సంసారసంఛిత్తయే".** (ఉత్తారకత్వరూపమైన ఆచార్యత్వము చరమగురువైన శ్రీరామానుజులు ఒక్కరియందే కలదు. ఇక మిగిలిన ఆచార్యులు ఎవ్వరియందును లేదు. ఎందులకనగా – వారు అందరు రామానుజులచే సత్తను పొందినవారు కదా! అందుచే శ్రేయస్సును కోరువారు. ఆచార్యపరంపరచే ఉత్తారకముగా ఆశ్రయింపబడిన పాదాంబుజములను కల భగవద్రామానుజులను సంసార నిర్మూలము కొఱకై ఆశ్రయింపవలెను.) అని ఆ గ్రంథమునందే ఆ ఆచార్యులే పల్కుటనుబట్టి భగవద్రామానుజుల సర్వోత్తారకత్వము, ప్రథమపర్వనిష్ఠ – చరమపర్వనిష్ఠ బేధములేక అందరియందు సిద్ధించినదని వ్యక్తమగుచున్నది.

ఇచట ఒక సందేహము కలుగుటకు అవకాశము కలదు. అన్ని విధములుగా పరమకారుణికులై, చరమగురువైన శ్రీరామానుజులకు సర్వోత్తారకత్వమును అంగీకరించినచో, సర్వశబ్దమునకు అర్థమున సంకోచము లేకపోవుటచే, వారికంటె ప్రాచీనులగు నాథ, యామున ప్రభృతులగు మన పూర్వాచార్యులందరికి వీరు ఉత్తారకులు కావలసి వచ్చును. అట్లు మనము అంగీకరించినచో అసంగతముగా తోచును. అందుచే రామానుజుల సర్వోత్తారకత్వము ఎట్లు సిద్ధించును? అనునది ఆ సందేహము. కాని, ఇట్లు సందేహించుట సరికాదు. నాథమునులకు శఠకోపులు స్వప్నమునందు భవిష్యదాచార్యులగు రామానుజుల రూపమును చూపి "ఈవ్యక్తి యున్న విధమును గమనించితిరా! వీరే ప్రపన్నకులమునకు చెందిన వారికి అందరికిని ఉత్తారకులు అగుదురు" అని పల్కిరి. అపుడు నాథముని "ఈ రూపమును నిత్యము సేవించుటకు తగిన ఉపాయమేది?" అని అడుగగా, శఠకోపులు భవిష్యదాచార్య విగ్రహమును సృష్టించి, అందు ఒక శక్తివిశేషమును ప్రవేశింపచేసి ఆ విగ్రహమును నాథమునులకు అనుగ్రహించుచు, **"రామస్య దక్షిణో బాహుః"** అను విధమున వీరిని నాకు శేషముగా గ్రహింపుడు. వీరిచే లోకమునందు అంతట శ్రీవైష్ణవ సిరి వృద్ధిచెంద గలదు. వీరినే "ఉత్తారకులుగా మీరు ఉపదేశింపుడు" అని పల్కిరి. అందుచే నాథమునులమొదలు ఇంతవరకు గల పూర్వాచార్యులు అందరు శఠకోపసూరి ఆజ్ఞచొప్పున శ్రీరామానుజులయందు ఉపకారకత్వము నిశ్చయించుకొని, తదేకనిష్ఠులై ఉండిరి. పెరియనమ్బి మొదలగు పూర్వాచార్య లును తమకు ఉత్తారకత్వము లేకుండుటచే ఉపదేష్టల రూపమున శ్రీరామానుజు లతో సంబంధము కలవారై, తమ కుమారులను ఆ మహనీయుల పాదములను ఆశ్రయించునట్లు చేసి, తద్ద్వారా శ్రీరామానుజుల సర్వోత్తారకత్వమును వ్యక్తముచేసిరి. కావున ఇట్టి సందేహమునకు తావు లేదు. సద్వృద్ధచిరోపాసనాలబ్ధ సకలసంప్రదాయ రహస్యార్థవిదులగు అముదనార్ **"పల్లుయిర్క్కు విణ్ణిన్ తలై నిన్ఱు వీడళిప్పాన్ ఎమ్మిరామానుశన్"** అని, **"ఉయిర్కళెల్లామ్ ఉయ్దఱ్కుదవుమ్"** అనియు భగవద్రామానుజుల సర్వోత్తారకత్వమును గూర్చి పల్కిరి కదా !

**"పేఱొన్ఱు మఱ్ఱిల్లై నిన్ శరణన్ఱి, అప్పేఱళిత్తఱ్కు ఆఱొన్ఱుమిల్లై మఱ్ఱచ్చరణన్ఱి"** (నీ పాదసేవ తప్ప వేఱొక ఉపేయము లేదు, ఆ ఫలమును పొందుటకు నీ పాదములు తప్ప వేఱొక ఉపాయము లేదు.) అనుచూ అముదనార్ ఇరామానుశనూఱ్ఱన్దాదిలో భగవద్రామానుజుల చరణములే ప్రాప్యప్రాపకము లనుటను తెల్పిరి. **"పేఱొన్ఱు మఱ్ఱిల్లై, ఆఱొన్ఱు మఱ్ఱిల్లై"** అని ఇచట



అన్యయోగవ్యవచ్ఛేదమును చేయుటచే – అనగా వేఱొక ఉపేయము, ఉపాయ మును లేదని తెలుపుటచే, భగవద్రామానుజుల పట్ల భక్తిని కలవానికి తద్వతిరిక్త విషయము లలో ప్రాప్యత్వ ప్రాపకత్వ బుద్ధి ఉండుట ఆ రామానుజుల ముఖోల్లాసము కల్గించుటకే తప్ప కార్యకరమగుటచే కాదని తెలియుచున్నది. "నా సంబంధమును తెలిపినవారిపట్ల ఇతడు ఇంతటి ప్రావణ్యమును కల్గి యున్నాడు కదా!" అని శ్రీరామానుజుల ముఖము వికసించుటకది హేతువగును కదా! ఈ రహస్యమును **"ఏతద్వ్యతిరిక్తవిషయప్రాప్యత్వ ప్రాపకత్వబుద్ధి రపి ఏతదభిమానాంతర్భూతానామ్ ఏతద్రామానుజగురుముఖకమల విలాసహేతుకోటా వంతర్భూతా భవతి. న తు కార్యకరణకోటౌ. తదుత్పాదకోపయుక్త వ్యవసాయస్య తస్య తస్మిన్నేవ కృతత్వాత్"** అని జీయర్ పల్కినట్లు ఎఱుమ్బియప్పా చరమగురు నిర్ణయమను గ్రంథములో తెల్పిరి. మఱియు సోమాశియాణ్డాన్ అను ఆచార్యులు **"శ్రీమలక్ష్మణయోగినోఽన్యగురుషు ప్రాప్యాదిభావాశ్రయా బుద్ధిః తన్ముఖ హర్షసంభవకరా విజ్ఞాయతే నాన్యథా, తస్మాత్తత్పదపంకజే భృశకరమ్ పూర్వైః కృతత్వా దయం సర్వేషా మపి ముక్తిదః కరుణయా రామానుజార్యో గురుః"** అనుచు గురుగుణవివరణమను గ్రంథములో ఈ అంశమును తెలియజేసిరి.

ప్రథమపర్వములో నిలచినవానికిని భగవద్రామానుజుల సంబంధము అవశ్యము అపేక్షితము – అనుట పూర్వోదాహృత ప్రమాణములవలన స్పష్టము. ఈ అంశమును నిరూపించుచు ఎఱుమ్బియప్పా చరమగురు నిర్ణయమను గ్రంథములో **"భగవత్సంబంధమ్ కులైయామల్ నిలైనిఱుత్తిక్కొళ్ళుమవనుక్కు ఎమ్బెరుమానారుడైయ సంబంధమిల్లావిడిల్ నిలైనిల్లాదితే. ఇవనుక్కు ప్రథమత్తిల్ భగవత్ సంబంధమ్ తానుణ్డాకిఱదుమ్ భగవత్ప్రవణోజ్జీవన ముణ్డానాలాయ్త్తు. అన్యశేషత్వత్తై కழిత్తుక్కొణ్డు భగవదనన్యార్హశేషత్వముఖత్తాలే ఉజ్జీవన ముణ్డామ్బడి పణ్ణవేణ్డుమ్. ఇప్పడి ఉజ్జీవనోపయుక్తమాన తదనన్యార్హశేషత్వమ్ నిలైనిఱ్కుమ్ పోదు తదీయపర్యంతమాయ్ నిఱ్కవేణ్డుకైయాలే, తదీయాగ్రేసరరాయ్, పరమ కారుణికరాన ఎమ్బెరుమానార్క్కు అడిమైప్పట్టు, ఏతదనన్యార్హశేషత్వసంబంధ సిద్ధియైయుడైయవనావదు. ఆకైయాల్ ప్రథమపర్వనిష్ఠనుక్కుమ్ చరమగురువాన ఎమ్బెరుమానారుడైయ సంబంధమ్ అవశ్యమ్ వేణుమితే"** (భగవత్సంబంధము నశింపకుండా నిలువవలెనని కోరుకొనువానికిని శ్రీరామానుజుల సంబంధము లేనిచో ఆ భగవత్సంబంధము స్థిరముగా నిలువదు కదా! ఇతనికి – అనగా జీవునకు మొదట భగవత్ప్రవణోజ్జీవనము కలిగిననే కదా! భగవత్సంబంధము కలుగును. అన్యశేషత్వమును లేకుండ చేసికొని, భగవదనన్యార్హ శేషత్వము పొందుటద్వారా ఉజ్జీవనము పొందునట్లు చేసికొనవలెను. ఇట్లు తరించుటకు

ఉపయుక్తమగు తదనన్యార్హశేషత్వము స్థిరముగా నిలచియుండుటకు అది తదీయ పర్యంతము కావలసియున్నది. కావున తదీయాగ్రేసరులై – అనగా – భగవద్భక్తులలో గొప్పవారై, గొప్ప కరుణకలవారైన రామానుజులకు దాసులై, వారితో అనన్యార్హశేషత్వ సంబంధసిద్ధిని కల్గియుండవలెను. ఇందుచే ప్రథమపర్వ నిష్ఠునకును చరమగురువగు శ్రీరామానుజుల సంబంధము అవశ్యకము అపేక్షితము.) అని పల్కుటయు ఇచట స్మరణీయము. ఈ విషయమునే జీయర్ సాయించినట్లుగా ఎఱుమ్బియప్పా చరమగురు నిర్ణయమును గ్రంథములో ఉదాహరించిన ఈ క్రిందిసూక్తి తెలుపుచున్నది **"భగవదనన్యార్హశేషత్వరూప సంబంధస్థైర్యాకాంక్షిణః చరమగురు – రామానుజాచార్య సంబంధాభావే తత్సంబంధ స్థైర్యసిద్ధిః న స్యాత్. అస్య చేతనస్య ప్రథమతో భగవత్ సంబంధసద్భావేఽపి భగవత్ప్రవణోజ్జీవన సద్భావే సతి చేత్, తత్సిద్ధి రపి అన్యశేషత్వ నివృత్తిపూర్వక భగవదనన్యార్హశేషత్వసద్భావే హి స్యాత్, ఏవ ముజ్జీవనోపయుక్త తదనన్యార్హశేషత్వ సద్భావస్య తదీయపర్యంతత్వ ఏవ సిద్ధత్వాత్, తదర్థం తదీయాగ్రేసర పరమకారుణిక రామానుజగురుసమాశ్రయణమ్ లబ్ధ్వా, ఏతదనన్యార్హశేషత్వ సంబంధయుక్త స్సన్, తదనంతరం ఖలు తదనన్యార్హశేషత్వ సిద్ధియుక్తో భవతి. అత ఏవ ప్రథమపర్వనిష్ఠస్యాపి చరమగురు పరమకారుణిక రామానుజ గురుచరణ సమాశ్రయణ మవశ్యాపేక్షితం భవతి".**

ఈ ఆచార్యపదవి అనునది ఎంతటి స్పృహణీయమైనదనగా – అవాప్తసమస్త కాముడైన సర్వేశ్వరుడే గీతా – అభయ ప్రదానములను అనుగ్రహించుట ద్వారా తనకు గురుపరంపరలో స్థానము కల్గునట్లు చేసికొనెను. అందుచే సర్వేశ్వరుడును ఆచార్యపరంపరలో చేరినవాడే. శ్రుతియును – **"స చాచార్యవంశో జ్ఞేయ ఆచార్యాణా మసా వసా విత్యాభగవత్తః"** (భగవానుని నుండి ప్రారంభించి క్రమముగా ఆచార్య పరంపరను తెలిసికొనదగును) అనుచు అట్లే వచించినది. మన పూర్వాచార్యులందఱిచే ఆ విధముగానే **"లక్ష్మీనాథసమారంభామ్"** అని నిత్యము అనుసంధింపబడుచున్నది కదా! కావున పరమగురు, సర్వగురుభావము ఆ సర్వేశ్వరునియందే కలదు. దివ్యమహిషియగు లక్ష్మీదేవికి మంత్రరత్నమును స్వామి ఉపదేశించెను కదా! ద్వయోపదేశమునకు పూర్వరంగముగా గురుపరంపరను ఉపదేశింపవలెనని ధర్మవిదుల ఆచారము. **"పరంపరా ముపదిశే ద్గురూణాం ప్రథమం గురుః, ఉపదిశ్య ద్వయం సాంగం ప్రపత్తిం మానసీం దిశేత్"** (ఆచార్యుడు మొదట గురుపరంపరను ఉపదేశించును. ఉపదేశించిన పిమ్మట సాంగమైన మానసిక ప్రపత్తిని చేయింపవలెను)



అని కదా శాస్త్రమును విధించుచున్నది. కావున **"అస్మద్గురుభ్యో నమః"** ఇత్యాది వాక్యత్రయము గురుపరంపరాను గ్రాహకము. దీనినే అశేషశేషి, పరమప్రణయియగు భగవానుడు తనకు ప్రియతమయైన లక్ష్మీదేవికి ద్వయమంత్రమును ఉపదేశించుటకు పూర్వము ఉపదేశించెను. దీనినే ఆపద్ధనముగా రక్షించుకొనుచువచ్చిన అస్మత్పూర్వాచార్యు లందఱు తమను ఆశ్రయించినవారికి ఉపదేశించుచున్నారు.

**"అస్మద్గురుభ్యో నమః"** ఇత్యాది వాక్యత్రయమునకు క్రమముగా విభవ – వ్యూహ – పరత్వములచే అధిష్ఠింపబడిన శ్రీమన్నారాయణుడు వాచ్యుడు. ఎట్లనగా– **"అస్మద్దేశిక మస్మదీయపరమాచార్య నశేషాన్ గురూన్"** అని, **"ఆచార్యా నస్మదీయా నపి పరమగురూన్ సర్వమాచార్యవర్గమ్"** అనియును చెప్పబడిన రీతిలో ఈ వాక్యత్రయము వరుసగా సాక్షాదాచార్యులను, పరమాచార్యులను, తద్వ్యతిరిక్త సమస్తాచార్యవర్గమును నిర్దేశించుచున్నది. అనగా – ఆచార్యులు, వారికి మూలమగు పరమాచార్యులు, వారికిని మూలమగు సమస్తాచార్యవర్గమును తెలుపబడు చున్నారు. విభవములో భగవానుడు సాక్షాత్తు ఆచార్యుడయ్యెననుట గీతోపదేశాది సందర్భములో స్పష్టముకదా! కావున విభవమునకు ఆచార్యస్థానము. ఆ విభవమునకు మూలకందము కావున వ్యూహమునకు పరమాచార్య స్థానము. దానికిని మూలమగు పరరూపమునకు ఆచార్యవర్గస్థానము భావించుట ఉచితమే కదా! ఇట్లు ఈ వాక్యత్రయము విభవ, వ్యూహ, పరత్వములను నిర్దేశించుచున్నది అని అనదగును. కలిదోషప్రభావముచే లోకములన్నియు వ్యామోహమును చెందియుండగా, ప్రబలములైన అధర్మములను నిర్మూలించుట కొఱకు, పరమధర్మమును రక్షించుటకొఱకును యతిరాజావతారమును ఎత్తినవాడు అతడే కదా! **"కలౌ కశ్చి ద్భవిష్యతి", "కలౌ రామానుజో మునిః"** అనికదా మనచే స్తుతింప బడుచున్నది. ఈ విషయమే పూర్వాచార్యులచే బోధింపబడినది కూడ. **"పున ర్జజ్ఞే రామానుజ ఇతి పరబ్రహ్మముకురః"** అని, **"కాషాయేణ గృహీతపీతవసనా దండై స్త్రిభిః మండితా సా మూర్తిః మురమర్దనస్య జయతి త్రయ్యంతసంరక్షణీ"** (కాషాయమును దాల్చినది, త్రిదండముతో అలంకరింపబడినది, వేదాంతమును రక్షించునది అగు ఆ భగవానుని రూపము సర్వోత్కర్షతో వెలుగుచున్నది) అనియు ఈ విషయమే అస్మదాచార్యులచే ప్రతిబోధింపబడినది కూడ. ఈ విధముగా భగవానుని యందే ముఖ్యవృత్తమైన పరమగురుసర్వగురుభావము భగవత్స్వరూపు డైన భగవద్రామానుజులయందు కూడ సంక్రమించినది. అందుచే పూర్వము తెలుపబడిన వాక్యత్రయమునకు వాచ్యవస్తువు (వర్ణింపబడువిషయము) ఈ ఆచార్యవర్యుల గుణతత్త్వాదులని ఏర్పడినది.

**"ఆచార్యదేవో భవ"** (ఆచార్యుని దైవముగా కలవాడవగుము), **"దేవ మివాచార్య ముపాసీత"** (భగవానునివలె ఆచార్యుని ఉపాసింపనగును), **"యస్య దేవే పరా భక్తిః యథాదేవే తథా గురౌ"**, (భగవానునియందు గొప్పదైన భక్తిని కలిగియున్నట్లే, ఆచార్యునియందుకూడ గొప్ప భక్తిని కలిగినవాడు) **"యథాఽనుజీవీ నృపతిం యథా భక్త స్తు దైవతమ్, తథైవ దేశికం శిష్యః సేవేత"** (సేవకుడు రాజును, భక్తుడు దైవమును ఎట్లు సేవించునో, శిష్యుడు ఆచార్యుని అట్లే సేవింపవలెను) ఇత్యాది ప్రమాణములు భగవానుని సేవించునట్లే ఆచార్యునికూడా సేవింపవలయునను పరమార్థమును ప్రతిపాదించుచున్నవి. కావున సమస్తమైన భగవద్భజనప్రకారములన్నియు ("వందనం, కీర్తనమ్" – ఇత్యాది ప్రకారము లన్నియు) ఆచార్యుని భజనమునందును అన్వయింపనగును. భగవానుని భజనము సమస్త జీవులచే దేశకాలాదివిశేషము లేక, మిక్కిలి వ్యయము, ఆయాసములతో కూడిన విశ్వజిత్, చాంద్రాయణాదివ్రతములకంటె భిన్నములైన, కేవలము వాక్కుతోనే సాధ్యపడు నామామృతసంకీర్తనలతో చేయవీలున్నది. ఈ నామ సంకీర్తనమే పరమధర్మము. **"కో ధర్మః సర్వధర్మాణాం భవతః పరమో మతః"** (అన్ని ధర్మములలో ఏ ధర్మము గొప్పది అని నీ అభిప్రాయము) అనుచు ధర్మరాజు నీకు మిక్కిలి అభిమతమైన పరమధర్మమును ఉపదేశింపుమని ప్రార్థించినపుడు అందులకు బదులిచ్చుచు, పలువురు మహర్షులను, వృద్ధులను సేవించుటచేతను, దీర్ఘమైన బ్రహ్మచర్యవ్రతమువలనను, తపస్సమాధులవలనను బ్రహ్మసాక్షాత్కార మును పొందినవాడు, ఇంకను అట్టి మహిమలెన్నిటినో కలవాడు, తల్లిదండ్రులకు శుశ్రూషణ చేసి, వారి అనుగ్రహమువలన సంపాదించిన వరలాభమను సౌభాగ్యమును కలవాడు, పరతత్త్వమందే ప్రవర్తించువాడును అగు భీష్ముడు **"ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః, యద్భక్త్యా పుండరీకాక్షం స్తవై రర్చే న్నర స్సదా"** (నరుడు ఎల్లప్పుడు భక్తితో పుండరీకాక్షుని స్తోత్రములతో అర్చింపవలెను – అనునదియే అన్ని ధర్మములలో గొప్ప ధర్మముగా నాకు సమ్మతము) అనుచు భగవన్నామసంకీర్తనమే తనకు మిక్కిలి అభిమతమైన ధర్మమనెను. ఇట్టి భజనము భగవద్రూపులైన రామానుజుల భజనమునందును అతిదేశము చేయబడుటచే, ఆ స్వామి నామసంకీర్తనమునకు పరమధర్మత్వము సిద్ధించినది. ఈ సందర్భములో ఆచార్యనామసంకీర్తనము పరమ ధర్మమనుటకు ప్రత్యభిజ్ఞాపకములైన ప్రమాణము లెన్నో కలవు. వానిలో కొన్ని – **"తస్మా ద్గురుతరో గురుః, అర్చనీయ శ్చ వంద్యశ్చ, కీర్తనీయ శ్చ సర్వదా, ధ్యాయే జ్జపే న్నమే ద్భక్త్యా భజే దభ్యర్చయే న్మదా", "గురో న్నామ సదా జపేత్", "కుర్వీత పరమాం భక్తిం గురౌ తత్ప్రియవత్సలః, తదనిష్టాపవాదీ**



**చ తన్నామగుణహర్షితః", "ఆత్మనో హ్యతినీచస్య యోగిధ్యేయ పదార్హతామ్, కృపయైవోపకర్తార మాచార్యం సంస్మరేత్ సదా"** (అతినీచమైన ఆత్మకు యోగులచే ధ్యానింపతగిన పదమును పొందుటకు తగిన అర్హతను దయతో కల్గించి ఉపకారము చేయు ఆచార్యుని ఎల్లప్పుడు స్మరింపనగును) ఇత్యాదులు. ప్రఖ్యాత దైవపరమార్థ విదులు, సదాచారప్రవణులగు అస్మదాచార్యులందఱును ఇట్టి పరమధర్మములో మిక్కిలి నిష్ఠను కల్గియుండి రనుట ప్రత్యక్షసిద్ధము. కావున అట్టి నిష్ఠను మనము కూడ కల్గియుండవలెను. సత్పురుషులు ఆచార్యనిష్ఠను గమనించి, తద్రుచిపరిగృహీతమైన తత్త్వమునే హితముగా స్వీకరింతురుగాని, కేవలము అది ప్రామాణికము అనునంత మాత్రముచే కాదు కదా ! భగవద్రామానుజులచే 74మంది సింహాసనాధిపతులగు ఆచార్యపురుషులు లోకోజ్జీవనార్థము నియోగింపబడిరి. ఇచటి ఆచార్యపురుష శబ్దమునకు ఆచార్యులగు రామానుజులకు సంబంధించిన, వారికి శేషభూతులైన పురుషులని అర్థము. ఈ ఆచార్యపురుషులను ఆశ్రయించినచో పరంపరయా రామానుజుల పాదసంబంధమును పొందినట్లగును. కావున ఆచార్యపురుషులు ఆశ్రయనీయులు. ఈ అంశము సదాచార్యప్రాప్తము.

**"యేనాఽస్య పితరో యాతా యేన యాతాః పితామహాః, తేన యాయాత్ సతాం మార్గం తేన గచ్ఛన్ న రిష్యతే"** అను శ్రుతివాక్యములో పితృశబ్దము ఆచార్య వాచకము. **"స హి విద్యాత స్తం జనయతి, తచ్ఛ్రేష్ఠం జన్మ, శరీర మేవ మాతాపితరౌ జనయతః"** (అతడు– అనగా గురువు విద్యవలన అతనిని – అనగా శిష్యుని జన్మింపచేయుచున్నారు. ఆ జ్ఞానజన్మయే గొప్పది. శరీరమును మాత్రమే తల్లి దండ్రులు పుట్టించుచున్నారు) అని కదాస్మృతి వచనము. ఇచట శ్రుతివాక్యములోని పితృశబ్దమునందలి బహువచనము పూజ్యార్థకము. **"గరీయాన్ బ్రహ్మదః పితా"** అని చెప్పబడుచున్నది కదా! పితామహశబ్దము పరమాచార్యుల నుండి పైన గల సమస్తాచార్యవర్గమునకు ఉపలక్షకము.

ఇట్టి వాక్యగురుపరంపరనుగూర్చి ఇంచుక విన్నవింపబడుచున్నది. పొదుత్తని యన్ శ్లోకములవలెనే వాక్యగురుపరంపరయు సమాశ్రయణసమయమున ఆచార్యులచే ఉపదేశింపబడి నిత్యము అనుసంధింపబడుచున్నది. **"జప్తవ్యమ్ గురుపరంపరైయుమ్, ద్వయముమ్"** అను శ్రీవచనభూషణసూక్తి గురుపరంపరాప్రాధాన్యమును తెలుపగా, **"గురుపరంపరై అనుసంధానత్తైయొఴిన్ద ద్వయానుసంధానముమ్ దేవతాంతరభజనత్తో డొక్కుమ్"** అను ముదలియాణ్డాన్‌వార్త గురుపరంపరాప్రాథమ్యమును నొక్కి వక్కాణించు

చున్నది. ఈ గురుపరంపర ఆరోహణ-అవరోహణ క్రమమున రెండు విధములు. పూర్వము తెల్పినట్లు పొదుత్తనియన్‌లలోని **"లక్ష్మీనాథసమారంభామ్"** అను శ్లోకము అవరోహణక్రమములోని-అనగా-శ్రియఃపతినుండి స్వాచార్యపర్యంతమైనక్రమము లోని గురుపరంపరను నిర్దేశింపగా, ఈ వాక్యగురుపరంపర స్వాచార్యాదిశ్రియః పతిపర్యంతమైన ఆరోహణక్రమమున గురుపరంపరను తెలుపుచున్నది.

**"అస్మద్గురుభ్యో నమః"** అను వాక్యమునుండి **"శ్రీధరాయ నమః"** అను వాక్యమువరకు గల వాక్యగురుపరంపరలో 13 వాక్యములున్నవి. వీనిలో మొదటి మూడును వేదోక్తములని, మొగిలిన పది వాక్యములను కూరేశులు అనుగ్రహించిరని వ్యాఖ్యానమువలన స్పష్టమగుచున్నది. **"అస్మద్దేశికమ్"** అను శ్లోకగురుపరంపరను ముదలియాణ్డాన్ అనుగ్రహించిరని సంప్రదాయము. మనకు జ్ఞానజన్మను ప్రసాదించుటయేకాక, భగవల్లాభమునకు పురుషకారముచేయు మహోపకారకులగు స్వాచార్యులను, ఆచార్యులకు ఆచార్యులగు పరమాచార్యులను, వారికిని ఆచార్యులైన వారిని, అందఱికిని ఆచార్యుడగు శ్రీరంగనాథునివరకు గల సమస్తాచార్యవర్గమును మనము నిత్యము ధ్యానవిషయమొనర్చుకొనుట ఆవశ్యకము. కావున శ్లోక, వాక్య గురుపరంపరలు రెండును నిత్యానుసంధేయములైనవి.

ఈ గురుపరంపర రహస్యత్రయమునకు సమానమైనది. తిరుమంత్రమనబడు అష్టాక్షరి భగవానుడగు నారాయణునిచే ఆ భగవానుని అంశమే అగు నరునకు బదరీకాశ్రమములో ఉపదేశించినట్లు సంప్రదాయకథనము. కావున, నారాయణుడు ఆచార్యుడు, నరుడు శిష్యుడు. కాని, ఈ మంత్రము నరుని మూలముగా లోకమున ఎవరికిని ఉపదేశింపబడినట్లు తెలియుటలేదు. నరునకు గురుపరంపరలో స్థానమును లేదు. చరమశ్లోకమును భగవానుడు కురుక్షేత్రములో అర్జునునకు ఉపదేశించెను. కాని పిమ్మట అర్జునుడు దానిని ఎవరికిని ఉపదేశింపలేదు; అర్జునునకు గురుపరం పరలో చోటును లేదు. అట్లే, ద్వయమును భగవానుడు వైకుంఠములో లక్ష్మీదేవికి ఉపదేశించెను. లక్ష్మీదేవి నామము గురుపరంపరలో **"శ్రియై నమః"** అనియున్నను, ఈ వాక్యమును వివరించు తనియన్ శ్లోకము లక్ష్మీదేవినిగూర్చికాక, **"నమః శ్రీరంగ నాయక్యై"** అని శ్రీరంగనాయకి విషయముగానున్నది. ఆ విధముగానే **"శ్రీధరాయ నమః"**అను భగవానుని నిర్దేశించు వాక్యగురుపరంపరలోని వాక్యమునకు వివరణముగా అనుసంధించు తనియన్ శ్లోకము **"శ్రీస్తనాభరణం తేజః శ్రీరంగేశయమ్"** అనుచు శ్రీరంగనాథుని విషయముగానున్నది. అందుచే, రహస్యత్రయము వేర్వేరు కాలములలో



భగవానునిచే వేర్వేరు వ్యక్తులకు ఉపదేశింపబడినను, ఆ మూడింటిని కలిపి శ్రీరంగనాథుడు శ్రీరంగనాయకికి ఉపదేశింపగా, ఆమె శ్రీరంగములోని విష్వక్సేనులకు ఉపదేశించెనని, విష్వక్సేనులవలన శఠకోపసూరికి, వారినుండి నాథమునికి - ఇట్లు గురుపరంపరాక్రమము ఏర్పడెనని భావింపవలెనని ఆచార్యుల అభిప్రాయము. వాక్య గురుపరంపరలో అనుసంధింపబడుచున్నవి, ఆచార్యుల విషయముగా పూర్వాచార్యులచే అనుగ్రహింపబడినవి అగు తనియన్ శ్లోకములు అదే క్రమమున ఆచార్యులద్వారా ఉపదేశింపబడి, నిత్యము అనుసంధింపబడుచున్నవికదా!

ఈ వాక్యగురుపరంపరలోని అర్థమును అందఱు తెలిసికొని, ఉజ్జీవించుటకు అనుగుణముగా శ్రీపిళ్లైలోకమ్‌జీయర్ దీనికి మణిప్రవాళశైలిలో చక్కని వ్యాఖ్యను కృపచేసిరి. ఇది తమిళలిపిలో మూడు, నాల్గుమార్లు ప్రచురింపబడినది. ఇప్పటి సుమారు 60 సంవత్సరములకు ముందు ఇవి **"వాక్యగురుపరంపరార్థప్రకాశిక"** అను పేరుతో ఆంధ్రీకరింపబడి ఆంధ్రసంప్రదాయవివర్ధినీసభ, కాంచీపురముద్వారా ముద్రింపబడినది. అది ఇప్పుడు దుర్లభము. ప్రకృత ముద్రణము, 1992 సం॥న శ్రీయతిరాజపాదుకామాసపత్రికా సంపాదకులు ఉ॥వే॥ శ్రీమాన్ వి.వి. రామానుజన్ స్వామివారి ప్రచురణను అనుసరించి చేయబడినది. ఇందులకు సమ్మతించిన ఆ మహనీయుల సన్నిధిలో కృతజ్ఞతలను నివేదించుకొనుచు, నమస్కరించుచున్నాను. ఒకటి రెండు చోట్లమాత్రము అర్థానుసారముగా మూలమున మార్పుచేయవలసి వచ్చినది. విభవ, వ్యూహపరములచే క్రమముగా గురుత్వ, సర్వగురుత్వ, పరమగురుత్వ ములు సూచింపబడుచున్నవి అని తెలుపు **"ప్రథమావతారమాన..."** అను వాక్యములో గల **"నివాసమాన వైకున్దమానాడుమ్"** అను ప్రయోగము వైకుంఠమునే తప్ప పరరూపమును తెలుపదు. కావున దానిని **"వైకున్దవానాడు నివాసియాన"** అని మార్చబడినది. వాక్యగురుపరంపరావ్యాఖ్యానము బహుళప్రచారములో లేదు. కావున వ్యాఖ్యానమూలము అనువాదముతో చేర్చి ప్రచురింపబడుచున్నది. శ్లోక గురుపరంపరా వ్యాఖ్యానంతో పాటు ఈ వాక్యగురుపరంపరావ్యాఖ్యానము అనువాద సహితంగా ఇంతకు ముందే శ్రీరంగరామానుజ సేవాసంఘం, చీరాలవారిద్వారా ముద్రింప బడినది. ఇప్పుడు వాక్యగురుపరంపరావ్యాఖ్యానముమాత్రం అనువాదంతో పాటు ముద్రింపబడుతున్నది. కావున ఇది ద్వితీయముద్రణము. ఈ గ్రంథ ముద్రణకై ఆర్థికసాహ్యమందించిన శ్రీమతి దోమ తార, శ్రీమాన్ దోమ ప్రతాపరెడ్డి, దంపతులకు, వారి కుమారుడు శ్రీప్రమోద్, కోడలు శ్రీమతి అన్నపూర్ణ దంపతులకు, వారి కూతురు

శ్రీమతి ప్రణీత, అల్లుడు శ్రీమాన్ వేంకటరవీందర్‌రెడ్డి దంపతులకు అభినందన పురస్సరంగా అనేక మంగళాశాసనాలను చేస్తున్నాను. వీరు, ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకటనరసింహాచార్యస్వామి (అయోధ్యస్వామి) వారి దివ్యానుగ్రహానికి పాత్రమైన భాగ్యశాలురు. వీరి ఆస్తికత, ఆచార్యభక్తి మరింత పెంపొంది, శ్రీరామానుజ సిద్ధాంతప్రచారానికి, పరిరక్షణకు ఉపయోగపడాలని ఆశిస్తున్నాను. తమ పితృపాదులు ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకటనరసింహాచార్య స్వామివారి తిరునక్షత్రోత్సవ స్మారకచిహ్నంగా వాక్యగురుపరంపర వ్యాఖ్యానాన్ని ఆంధ్రానువాద సహితంగా ముద్రించడానికి ముందుకు వచ్చి, నన్ను ఈ ఆచార్యకైంకర్యంలో వినియోగించుకొన్న మిత్రమణులు ఉ.వే.శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్య స్వామివారికి, వారి సోదరులిరువురకు అనేక కృతజ్ఞతలను తెలుపుకుంటున్నాను. వీరు ప్రతిఏడు తమ పితృపాదుల తిరునక్షత్రోత్సవ సందర్భంగా ఉభయవేదాంత పండితసభలను నిర్వహించడం, ఆ సమయంలో ఒక సద్గ్రంథాన్ని ముద్రించడం చాలా అభినందించ దగిన విషయం. ప్రపన్నులైనవారందరూ నిత్యం అనుసంధించుకొన వలసిన వాక్యగురు పరంపర శ్రీపిళ్ళైలోకమ్‌జీయర్ ద్రావిడవ్యాఖ్యానంతోనూ, ఆ వ్యాఖ్యయొక్క ఆంధ్రాను వాదంతోనూ ప్రచురింపబడడం సహృదయులైన పెద్దలకు, ప్రపన్నులకు ఆనందాన్ని కల్గించగలదని నమ్ముతున్నాను. ఈ గ్రంథ ముద్రణలో సహకరించిన మిత్రులు శ్రీచంద్రశేఖర్‌గారికి, శ్రీహర్షవర్ధన్‌గారికి అనేక కృతజ్ఞతలను తెలుపుకుంటున్నాను. అనువాదంలోని లోటుపాట్లను సహించవలసినదిగా పాఠకులను కోరుతూ, స్వస్తి.

**వాధూలనరసింహార్య జనర్క్షోత్సవసంస్కృతిః ।**
**తత్పదాంబుజసాన్నిధ్యే కృతిః సేయం సమర్ప్యతే ॥**

ఇట్లు, నివేదించు
భాగవత విధేయుడు
**ఈ.ఏ. శింగరాచార్యులు**

తిరుపతి
11-1-2013



**శ్రీమతే రామానుజాయ నమః**



## శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ అరుళిచ్చెయ్‌ద
# వాక్యగురుపరంపరావ్యాఖ్యానమ్

**శ్రియఃపతియాయ్, శ్రీవైకుంఠనికేతనాయ్, నిత్యముక్తానుభావ్యనాయ్, నిరతిశయానందయుక్తనాయ్ ఇరుక్కిఱ సర్వేశ్వరన్, అన్ద నిత్యసూరికళోపాది తన్నై యనుభవిత్తు, నిత్యకైంకర్యరసనాయ్ వాழ்ంకైక్కు ప్రాప్తి ఉణ్డాయిరుక్కచ్చెయ్‌దేయుమ్, అతై యిழన్దు "అసన్నేవ స భవతి" ఎన్గిఱపడియే అసత్కల్పరాయ్, భోగమోక్షశూన్య రాయ్, "సంయుక్త మేకం క్షర మక్షరమ్" ఎన్గిఱపడియే తిలతైలవద్దారువహ్నివద్దుర్వివేచ త్రిగుణ-దురత్యయానాద్యచిత్సంబంధతిరోహిత స్వప్రకాశరాయిరుక్కిఱ సంసారి చేతనరుడైయ ఇழవై యనుసంధిత్తు, "స ఏకాకీ న రమేత" ఎన్గుమ్, "భృశం భవతి దుఃఖితః" ఎన్గుమ్ శొల్లుకిఱపడియే అత్యంతవ్యాకులచిత్తనాయ్, ఇవర్‌కళ్**

---

**(ఆంధ్రానువాదము)**

శ్రియఃపతియై, శ్రీవైకుంఠనికేతనుడై, నిత్యులచే ముక్తులచే అనుభవింప దగినవాడై, నిరతిశయమైన ఆనందమును కలవాడైయున్న సర్వేశ్వరుడు, ఆనిత్య సూరులవలెనే తనను సేవించి, నిత్యకైంకర్యమున రుచిని కలవారై ఉజ్జీవించుటకు తగిన ప్రాప్తిని కల్గినవారైనను, దానిని (ఆ కైంకర్యమును) పోగొట్టుకొని, **"అసన్నేవ స భవతి"** (బ్రహ్మము లేదని తలచువాడు లేనివాడే అగును) అనునట్లు అసత్కల్పురై, భోగమోక్షములను (ఇహలోకసుఖములను, మోక్షమును) లేనివారై, **"సంయుక్త మేకం క్షర మక్షరమ్"** (క్షరశబ్దవాచ్యమైన ప్రకృతి, అక్షరశబ్దవాచ్యుడైన జీవుడును ఒక్కటిగా కలసినవారైరి) అనునట్లు తిలలోని తైలమువలె, కాష్ఠములోనున్న అగ్నివలె గమనించి తెలిసికొనుటకు సాధ్యము కాని, (సత్త్వరజస్తమోరూప) త్రిగుణాత్మకమైన, దాటుటకు సాధ్యము కాని, అనాదియైన అచిత్ సంబంధముచే ఆవరింపబడిన జ్ఞానరూపమైన స్వప్రకాశమును కలవారైయున్న సంసారిచేతనుల నష్టమును అనుసంధించి (తలచి), **"స ఏకాకీ న రమేత"** (వైకుంఠములోనున్న ఆభగవానుడు ఏకాకిగాయున్నవానివలె సంతోషింపలేదు) అని, **"భృశం భవతి దుఃఖితః"** (మిక్కిలి దుఃఖించినవాడు

కరణకళేబరఙ్గళై ఇழన్దు, **“లూనపక్ష ఇవాండజాః”** ఎన్గిఱపడియే ఇఱకొడిన్ద పక్షిపోలే కిడక్కిఱదశైయిలే **“నామరూపే వ్యాకరవాణి”** ఎన్గుమ్, **“అన్నాళ్ నీతన్ద వాక్కై”** ఎన్గుమ్ శొల్లుకిఱపడియే ఇవర్ కళుక్కు క్కరణకళేబరఙ్గళై క్కొడుత్తు, అవఱ్ఱైక్కొణ్డు వ్యాపరిక్కైక్కీడాన శక్తివిశేషఙ్గళైయుమ్ కొడుత్తు, దేహాత్మాభిమానముమ్, అన్యశేషత్వ ముమ్, స్వస్వాతంత్ర్యముమాన ముక్కుழియిలే విழున్దు అనర్థప్పడాదే తన్నై యాశ్ర యిత్తు ఉజ్జీవిక్కైక్కుడలాక **“అపౌరుష మప్రభవమ్”** ఎన్గిఱపడియే అపౌరుషేయమాయ్, అత ఏవ పురుషశేముషీ కృతమాలిన్యదోషవినిర్ముక్తమాయ్, **“వేదశాస్త్రాత్ పరం నాస్తి”** ఎన్గిఱపడియే తనక్కు మేఱ్పట్టదొరు శాస్త్రమిన్ఱియే ఇరుప్పదాన స్వతఃప్రమాణమాన వేదత్తై **“యో వై వేదాం శ్చ ప్రహిణోతి తస్మై”**, **“అరు మఱైయై వెళిప్పడుత్త అమ్మాన్”** ఎన్గిఱపడియే నారాయణప్రయుక్తమాన తన్నుదరత్తైతిప్పాలే (తరిప్పాలే) తానే ప్రవర్తిప్పిత్తవిడత్తిలుమ్, తదర్థనిర్ణయమ్తాన్ సర్వశాఖాప్రత్యయన్యాయాది సాపేక్షమా

---

అగుచున్నాడు) అనియును పల్కునట్లు మిక్కిలి వ్యాకులమును కల మనస్సును కలవాడై, వీరు (జీవులు) కరణములను, కళేబరమును పోగొట్టుకొని, **“లూనపక్ష ఇవాండజాః”** (ఱెక్కలు నఱుకబడిన పక్షులవలె) అను రీతిలో ఱెక్కలు రాలిన పక్షులవలె పడియున్న దశలో **“నామరూపే వ్యాకరవాణి”** (నామరూపముల విభాగము చేయుదును) అనియు, **“అన్నాళ్ నీ తన్ద వాక్కై”** (ఆనాడు నీవు అనుగ్రహించిన దేహము) అనియును పల్కునట్లు వీరికి కరణకళేబరములను ఇచ్చి, వానిని గొని ప్రయత్నించుటకు తగిన శక్తివిశేషములనుకూడ వారికి ఇచ్చి, దేహాత్మాభిమానము, అన్యశేషత్వము, స్వస్వాతంత్ర్యము – అను మూడు గోతులలో పడి, అనర్థమును పొందకుండ తనను ఆశ్రయించి ఉజ్జీవించుటకు తగిన **“అపౌరుష మప్రభవమ్”** (పురుషనిర్మితము కానిది, పుట్టుక లేనిది) అనునట్లు అపౌరుషేయమై, కావుననే పురుషుల బుద్ధిచే నిర్మితమగుట వలన కలుగు మాలిన్యదోషములను లేనిదై, **“వేదశాస్త్రాత్ పరం నాస్తి”** (వేదమును శాస్త్రముకంటె గొప్పది లేదు) అనునట్లు తనకంటె గొప్పదైనదొక శాస్త్రము లేకుండనుండునట్టి స్వతః ప్రమాణమైన వేదమును **“యో వై వేదాం శ్చ ప్రహిణోతి తస్మై”** (ఎవడు ఆ బ్రహ్మకు వేదములనుకూడ ఉపదేశించు చున్నాడో), **“అరు మఱైయై వెళిప్పడుత్త వమ్మాన్”** (అరుదైన వేదమును ప్రకాశింపచేసిన స్వామి) అనునట్లు నారాయణప్రయుక్తమైన తన గర్భ సంబంధము కారణముచే తానే ప్రవర్తింపజేసినను, ఆ వేదార్థనిర్ణయమునకుకూడ సర్వశాఖాప్రత్యయన్యాయము మొదలగు న్యాయముల అవసరముండుటచే, మందబుద్ధులకు అర్థనిర్ణయము చేయుట దుర్లభము అనియు, దీనిద్వారా (ఈ మార్గమున) వీరు మాఱి, (సంసారసాగర) తీరమును చేరుట అరుదు



యిరుక్కైయాలే అల్పమతికళుక్కు అర్థనిశ్చయమ్ పణ్ణుకై అరిదెన్గుమ్, ఇమ్ముకత్తాలే ఇవర్కళ్ తిరున్ది, క్కరైమరమ్ శేరుకైయు మరిదెన్గుమ్, ఉపదేశపరమ్పరైకళాలే ఇవర్కళై త్తిరుత్తి ఉజ్జీవిప్పిక్కై ఎళిదెన్గుమ్ తిరువుళ్ళమ్ పఱ్ఱి, **“ఆచార్యాణా మసా వసా విత్యాభగవత్తః”** ఎన్గుమ్ ఉపదేశన్దాన్ భగవానాన తానడియాక వన్దదాయిరుక్కుమాకైయాలే అదఱ్కాక **“మున్నై వణ్ణమ్ పాలిన్ వణ్ణమ్”** ఎన్గుమ్, **“శశివర్ణమ్”** ఎన్గుమ్, **“వల్లనెమ్బిరాన్ విట్టువే”** ఎన్గుమ్ శొల్లుకిఱపడియే తిరుమంత్రత్తై ఉపదేశిక్కుమిడత్తిల్, తదుపదేష్టావుక్కు వడివాయిరున్దుళ్ల శుద్ధస్వభావత్వ శబ్దసంపత్త్యాద్యశంకిత అఘటిత ఘటనాసామర్థ్యాది కళైయుముడైయ నాయ్, **“బహుధా విజాయతే”** ఎన్గుమ్, **“శన్మమ్ పలపల శెయ్దు”** ఎన్గుమ్ శొల్లుకిఱపడియే పలవకై పట్టిరున్దుళ్ల విభవఙ్గళిల్ వైత్తుక్కొణ్డు, **“మధ్యే విరించి గిరిశం ప్రథమావతారః”** ఎన్గుమ్పడి ప్రథమావతారమాన మహావిష్ణువాయ్క్కొణ్డు, ఇన్ద అణ్డాన్తర్వర్తియాన సత్యలోకత్తుక్కుమ్ అవ్వరుకాయిరున్దుళ్ల శ్రీవిష్ణులోకత్తిలే **“జగదుపకృతయే సోఽయ మిచ్ఛావతారః”** ఎన్గిఱపడియే ఇన్ద జగత్తై వాழ్విప్పదఱ్కాక

---

అనియును, ఉపదేశపరంపరలతో వీరిని సంస్కరించి, ఉజ్జీవింపచేయుట సులభ మనియును తలచి, **“ఆచార్యాణా మసా వసా విత్యాభగవత్తః”** (ఆచార్యుల పరంపర భగవానునివరకు ఇతడు ఇతడు అనుచు అనుసంధింపదగినది) అనియు, (ఆ) ఉపదేశము భగవానుడగు తన మూలముగా వచ్చినదగుటచే, అందులకొఱకు **“మున్నై వణ్ణమ్ పాలిన్ వణ్ణమ్”** (మొదటి వర్ణము పాలవంటి తెల్లని రంగు) అనియు, **“శశివర్ణమ్”** (చంద్రుని వర్ణమును కలవానిని) అనియు, **“వల్లనెమ్బి రాన్ విట్టువే”** (సమర్థుడు నా స్వామి విష్ణువు) అనియు పల్కు రీతిలో తిరుమంత్రమును ఉపదేశించునపుడు ఆ ఉపదేష్టయొక్క రూపమైయున్న శుద్ధస్వభావమును కల్గి యుండుట, శబ్దసంపత్తిని కల్గియుండుట మొదలగు నిస్సంశయమైన అఘటితఘటనా సామర్థ్యము మొదలగువానిని కలవాడై, **“బహుధా విజాయతే”** (అనేక విధములుగా జన్మించుచున్నాడు) అనియు, **“శన్మమ్ పలపల శెయ్దు”** (జన్మలను పెక్కింటిని ఎత్తి) అనియును చెప్పురీతిలో పలు రీతులను కల్గియున్న విభవావతారములలో **“మధ్యే విరించి గిరిశం ప్రథమావతారః”** (బ్రహ్మరుద్రుల మధ్యలోని విష్ణురూపము భగవానుని మొదటి అవతారము) అనునట్లు ప్రథమావతారమగు మహావిష్ణువై, ఈ బ్రహ్మాండము లోపలనుండు సత్యలోకమునకు ఆవలి వైపుననున్న శ్రీవిష్ణులోకములో **“జగదుపకృతయే సోఽయ మిచ్ఛావతారః”** (లోకముయొక్క ఉపకారముకొఱకు ఈ స్వేచ్ఛావతారము– అనగా – ఇచ్ఛాపూర్వకమైన విభవావతారము) అనునట్లు ఈ లోకమును ఉజ్జీవింప

“శ్రోణా నక్షత్రమ్ విష్ణు ర్దేవతా” ఎన్నుమ్పడి విష్ణుదేవతాకమాన తిరువోణమెన్గిఱ తిరునక్షత్రత్తిలే స్వేచ్ఛయా స్వయమేవ అవరిత్తరుళి, ఉడనే “ఇఱైయుమ్ అకలకిల్లేన్” ఎన్ఱిరుక్కుమ్ పెరియపిరాట్టియారైయుమ్, అన్ద విష్ణులోకత్తిలే తానే “పద్మే స్థితామ్” ఎన్నుమ్, “తేనే మలరుమ్” “పూమేలిరుప్పాళ్” ఎన్నుమ్, “విష్ణుపత్నీమ్” ఎన్నుమ్ శొల్లుకిఱపడియే అప్పోழுదై త్తామరైప్పూవిలే మహాలక్ష్మీ ఎన్గిఱ తిరునామత్తైయుడైయ ళాయ్, స్వమహిషీయాక త్తానే తిరువవతరిప్పిత్తరుళి, “తాపః పుండ్ర స్తథా నామ మంత్రో యాగ శ్చ పంచమః, అమీ పరమసంస్కారాః పారమైకాంత్యహేతవః” ఎన్ను రహస్య త్రయోపదేశన్దాన్ తాపోర్ధ్వపుండ్రనామ మంత్రయాగపూర్వకమాక ఇరుక్కిఱతోపాది, “పరంపరా ముపదిశేత్ గురూణాం ప్రథమో గురుః, ఆత్మవిద్యా విశుద్ధ్యర్థమ్ స్వాచార్యాద్యాం ద్విజోత్తమః” ఎన్నుమ్, “సహస్రపురుషం వాపి శతపూరుష

---

చేయుట కొఱకు **“శ్రోణా నక్షత్రమ్ విష్ణు ర్దేవతా”** (శ్రవణానక్షత్రమునకు అధిదేవత విష్ణువు) అనునట్లు విష్ణుదేవతాకమైన శ్రవణమను నక్షత్రమునందు స్వేచ్ఛతో స్వయముగా అవతరించి, తన వెంటనే, **“ఇఱైయుమ్ అకలకిల్లేన్”** (ఒక్క క్షణమైనను భగవానుని విశ్లేషింపలేను) అని యుండు లక్ష్మీదేవిని, ఆ విష్ణులోకములోనే **“పద్మే స్థితామ్”** (పద్మమందు నివసించియున్నదానిని) అనియు, **“తేనే మలరుమ్ పూమేలిరుప్పాళ్”** (తేనెను స్రవించు పూవుయందున్నది) అనియు, **“విష్ణుపత్నీమ్”** (విష్ణువుయొక్క పత్నిని) అనియు పల్కురీతిలో అపుడే వికసించిన తామరపూవులో మహాలక్ష్మి అను శుభనామమును కల్గినదై, తన మహిషిగా అవతరింపజేసి, **“తాపః పుండ్ర స్తథా నామ మంత్రో యాగ శ్చ పంచమః, అమీ పరమసంస్కారాః పారమైకాంత్యహేతవః”** (చక్రాంకనము, పుండ్రధారణము, దాస్యనామము, మంత్రోపదేశము, అనుయాగము – అను ఈ అయిదు గొప్ప సంస్కారములు పరమై కాంతి అగుటకు హేతువులు) అనునట్లు రహస్యత్రయోపదేశము తాప–ఊర్ధ్వ పుండ్రధారణ – నామధారణ – మంత్రోపదేశ – యాగపూర్వకముగానున్నట్లే. **“పరంపరా ముపదిశే ద్గురూణాం ప్రథమో గురుః, ఆత్మవిద్యావిశుద్ధ్యర్థమ్ స్వాచార్యాద్యాం ద్విజోత్తమః”** (బ్రాహ్మణశ్రేష్ఠుడగు ప్రథమ గురువు–అనగా–స్వాచార్యుడు తన ఆచార్యుని మొదలుగానున్న ఆచార్యపరంపరను శిష్యునకు ఆత్మజ్ఞానమును పొందుటకు తగిన శుద్ధి ఏర్పడుటకొఱకు ఉపదేశింపవలెను) అనియు, **“సహస్ర పురుషం వాపి శతపూరుష మేవ వా, త్రిసప్తపురుషం వాపి ద్విసప్తదశపూరుషమ్”** (వేయి మంది పురుషులనుగాని, నూఱుమంది పురుషులనుగాని, ఇరువదియొక్కమంది పురుషులనుగాని, ఇరువది



మేవ వా, త్రిసప్తపురుషం వాపి ద్విసప్తదశపూరుషమ్” ఎన్నుమ్, “ఆదావు పదిశే ద్వేదే” ఇత్యాదికళిల్ గురుపరంపరాసంగ్రహమాయిరున్దుళ్ల “అస్మద్గురుభ్యో నమః” ఇత్యాదివాక్యత్రయోపదేశ పూర్వకమాయిరుక్కుమ్ ఎన్గైయాలే, “శ్రీవిష్ణులోకే భగవాన్ విష్ణు ర్నారాయణ స్స్వయమ్, ప్రోక్తవాన్ మంత్రరాజాదీన్ లక్ష్మ్యై తాపాదిపూర్వకమ్” ఎన్నుమ్, “విష్ణు మాదిగురుం లక్ష్మ్యాః మంత్రరత్నప్రదం భజేత్” ఎన్నుమ్ శొల్లుకిఱపడియే అవళుక్కు తాపోర్ధ్వ పుండ్రదాస్యనామ ప్రదానపురస్సరమాన ఇన్ద వాక్యత్రయోపదేశ పూర్వకమాక స్వరూప– ఉపాయ–పురుషార్థయాథాత్మ్యప్రతిపాదక మాన రహస్యత్రయత్తై నేరాక త్తానే ఉపదేశిత్తరుళి–

అప్పడియే “సోపదిష్టవతీ ప్రీత్యా తాపపుండ్రాదిపూర్వకమ్, విష్ణులోకేఽవతీర్ణాయ ప్రియాయ సతతం హరేః, సేనేశాయ ప్రియా విష్ణోః మూలమంత్రద్వయాదికమ్”

---

నాల్గుమంది పురుషులనుగాని) అనియు, **“ఆదా వుపదిశే ద్వేదే”** (మొదట వేదమును ఉపదేశింపనగును) ఇత్యాదులయందు గురుపరంపరా సంగ్రహమైయున్న **“అస్మద్గురుభ్యో నమః”** ఇత్యాది మూడు వాక్యములయొక్క ఉపదేశములతో ప్రారంభమగును – అని చెప్పబడియుండుటచే, **“శ్రీవిష్ణు లోకే భగవాన్ విష్ణు ర్నారాయణస్స్వయమ్, ప్రోక్తవాన్ మంత్రరాజాదీన్ లక్ష్మ్యై తాపాదిపూర్వకమ్”** (భగవానుడగు విష్ణువు శ్రీమన్నారాయణుడు స్వయముగా విష్ణులోకములో అష్టాక్షరి మొదలగువానిని తాపాది సంస్కారపూర్వకముగా లక్ష్మీదేవికి ఉపదేశించెను) అనియు, **“విష్ణు మాదిగురుం లక్ష్మ్యాః మంత్రరత్నప్రదం భజేత్”** (ఆదిగురువు, లక్ష్మికి మంత్రరత్నమును అనుగ్రహించినవాడగు విష్ణువును భజింపనగును) అనియును పల్కు రీతిలో ఆమెకు తాప–ఊర్ధ్వపుండ్ర–దాస్య నామప్రదానపూర్వకముగా ఈ మూడు వాక్యముల (**అస్మద్గురుభ్యో నమః, అస్మత్పరమ గురుభ్యో నమః, అస్మత్సర్వగురుభ్యో నమః** – అను మూడు వాక్యముల) ఉపదేశపురస్సరముగా స్వరూప–ఉపాయ–పురుషార్థ యాథాత్మ్యప్రతిపాదకమైన రహస్యత్రయమును స్వయముగా తానే ఉపదేశించెను.

అట్లే, **“సోపదిష్టవతీ ప్రీత్యా తాపపుండ్రాదిపూర్వకమ్, విష్ణులోకేఽవతీర్ణాయ ప్రియాయ సతతం హరేః, సేనేశాయ ప్రియా విష్ణోః మూలమంత్రద్వయాదికమ్”** (విష్ణులోకములో అవతరించినవాడు, విష్ణువునకు ఎల్లప్పుడు ఇష్టమైనవాడును అగు విష్వక్సేనునకు ‘విష్ణుప్రియ’ అనునట్లు భగవానునకు మిక్కిలి ప్రియమైన దేవేరియగు లక్ష్మీదేవి ప్రీతితో తప్తచక్రాంకనము, ఊర్ధ్వపుండ్రధారణము మొదలగు సంస్కారము

ఎన్గిఱ పడియే అవళైక్కొణ్డు అన్ద విష్ణులోకత్తిల్ తానే అవతీర్ణరాన సేనైముదలియారుక్కుమ్ ఇన్ద క్రమత్తిలే రహస్యత్రయోపదేశత్తై ప్పణ్ణువిత్తు, ప్పిన్నైయు మప్పడియే "సేనేశ స్స్వయ మాగత్య ప్రీత్యా శ్రీనగరీం శుభామ్, శఠకోపాయ మునయే తింత్రిణీమూలవాసినే, తాపాదిపూర్వకం మంత్రద్వయశ్లోకవరాన్ క్రమాత్, విష్ణుపత్న్యా మహాలక్ష్మ్యా నియోగాదుపదిష్టవాన్" ఎన్గిఱపడియే ఇన్దక్రమత్తిలే తానే సేనైముదలియారై క్కొణ్డు తిరునగరియిలే తిరుప్పుళియాఴ్వారడియిలే ఎఴున్దరుళియిరుక్కిఱ ఆఴ్వారుక్కు రహస్యత్రయోపదేశత్తై ప్పణ్ణువిత్తు, ఉడనే తాన్ అవరుక్కు "మయఱ్వఱ మదినల మరుళి", "పున శ్చ నాథమునయే పంచసంస్కారపూర్వకమ్, భట్టనాథప్రభృతిభిః నిర్మితైః దివ్యయోగిభిః, దివ్యైః వింశతిసంఖ్యాకై, ప్రబన్ధైః స్సహ దేశికః, స్వోక్తద్రమిడవేదానాం చతుర్ణా ముపదేశకృత్" ఎన్గిఱపడియే ఆఴ్వారైక్కొణ్డు అత్తిరునగరియిలే తిరుప్పుళియాఴ్వారడియిలే తానే నాథమునికళుక్కు మిన్ద క్రమత్తిలే రహస్యత్రయోపదేశత్తై దివ్యప్రబంధోపదేశాదిశిరస్కమాక ప్పణ్ణువిత్తు, ప్పిన్నైయుమ్–

అప్పడియే అన్ద నాథమునికళై క్కొణ్డు ఉయ్యక్కొణ్డార్ తొడక్కమానారుక్కుమ్, ఉయ్యక్కొణ్డారై క్కొణ్డు మణక్కాల్నమ్బితొడక్కమానారుక్కుమ్, మణక్కాల్నమ్బియై క్కొణ్డు ఆళవన్దార్ తొడక్కమానారుక్కుమ్, ఆళవన్దారై క్కొణ్డు పెరియనమ్బి తొడక్కమానారుక్కుమ్, పెరియనమ్బియై క్కొణ్డు ఉడైయవర్క్కుమ్, ఇన్ద క్రమత్తిలే రహస్యత్రయోపదేశత్తై ప్పణ్ణువిత్తుప్పిన్నైయుమ్ అప్పడియే –

ఉడైయవరై క్కొణ్డు ఆఴ్వాన్, ఆణ్డాన్ ముదలాన ఎఴుపత్తునాలు ముదలికళుక్కుమ్, ఎమ్బార్, అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ తొడక్కమాన ఎఴునూఱు జీయర్కళుక్కుమ్, మఱ్ఱుమ్ అనేక శ్రీవైష్ణవర్ కళుక్కుమ్ ఇన్దక్రమమ్ తప్పామే రహస్యత్రయోపదేశత్తై ప్పణ్ణువిత్తు, ప్పిన్నైయుమ్ అప్పడియే ఉడైయవర్ దర్శనత్తై నిర్వహిత్తుక్కొణ్డుపోకిఱ కాలత్తిలే "ప్రీత్యా పృథక్ పృథక్ శిష్యైః ప్రణమే దీశ్వరావధి, స్వారాధ్యం యావతా జ్ఞాతుం వాక్యం తావ దనుస్మరేత్" ఎన్నుమ్, "ప్రత్యహం ప్రణతైః

---

లతో ప్రారంభించి, తిరుమంత్రము, ద్వయము, చరమశ్లోకము అను మూడు రహస్యములను ఉపదేశించెను) అనునట్లు ఆమెను పురస్కరించుకొని ఆ విష్ణులోకములోనే అవతరించిన సేనేశులకును ఈ క్రమములో రహస్యత్రయోపదేశమును చేయించెను. అనంతరమును అట్లే – **"సేనేశ స్స్వయ మాగత్య ప్రీత్యా శ్రీనగరీం శుభామ్, శఠకోపాయ మునయే తింత్రిణీమూలవాసినే, తాపాదిపూర్వకం మంత్రద్వయశ్లోకవరాన్ క్రమాత్, విష్ణుపత్న్యా మహాలక్ష్మ్యా నియోగాదుపదిష్టవాన్"** (సేనైముదలియార్ స్వయముగా శుభప్రదమైన శ్రీనగరికి ప్రీతితో వేంచేసి, అచట తింత్రిణీ వృక్షముమూలమున నివసించు శఠకోపమునికి లక్ష్మీదేవి ఆజ్ఞతో క్రమానుసారమున తాపసంస్కారము మొదలుగా అష్టాక్షరి, ద్వయము, ఉత్తమమైన చరమశ్లోకము – అను వీనిని ఉపదేశించెను) అనునట్లు ఈ క్రమములో తానే సేనేశులను గొని శ్రీనగరిలో తింత్రిణీవృక్షమూలమున వేంచేసియున్న ఆఴ్వార్లకు రహస్యత్రయోప దేశమును చేయించి, వెంటనే తాను వారికి (ఆఴ్వార్లకు) ఎట్టి భ్రమ విప్రలంభాది దోషములేని జ్ఞానమును అనుగ్రహించి, **"పున శ్చ నాథమునయే పంచసంస్కార పూర్వకమ్, భట్టనాథప్రభృతిభిః నిర్మితైః దివ్యయోగిభిః, దివ్యైః వింశతిసంఖ్యాకైః ప్రబంధై స్సహ దేశికః, స్వోక్తద్రమిడవేదానాం చతుర్ణా ముపదేశకృత్"** (మఱియు, నాథమునుల జ్ఞానోపదేశికులగు నమ్మాఴ్వార్లు తాపము మొదలగు పంచసంస్కారపూర్వకముగా భట్టనాథులు మొదలగు దివ్యసూరులచే అనుగ్రహింపబడిన ఇరువది దివ్యప్రబంధము లతోపాటు, తాము అనుగ్రహించిన నాల్గు ద్రావిడవేదములగు నాల్గు దివ్యప్రబంధము లను ఉపదేశించిన ఆచార్యులయ్యిరి) అనునట్లు ఆఴ్వార్లను గొని ఆ శ్రీనగరిలో తింత్రిణీవృక్షమూలమున తానే నాథమునులకును ఈ క్రమములో రహస్య త్రయమును దివ్యప్రబంధోపదేశపర్యంతము చేయించెను. మఱియు అట్లే, –

అట్లే, ఆ నాథమునులను పురస్కరించుకొని ఉయ్యక్కొణ్డార్ మొదలగువారికిని, ఉయ్యక్కొణ్డార్ను గొని మణక్కాల్నమ్బి మొదలగువారికిని, మణక్కాల్నమ్బిని గొని ఆళవన్దార్ మొదలగువారికిని, ఆళవన్దార్ను గొని పెరియనమ్బి మొదలగువారికిని, పెరియనమ్బిని పురస్కరించుకొని ఉడైయవర్కును, ఈ క్రమములో రహస్యత్రయోప దేశమును చేయించెను, మఱియు ఆవిధముగానే –

భగవద్రామానుజులను పురస్కరించుకొని కూరేశులు, ముదలియాణ్డాన్ మొదలగు డెబ్బదినాల్గుమంది సింహాసనాధిపతులకును, ఎమ్బార్, అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ మొదలగు ఏడు వందలమంది జీయర్లకును, మిగిలిన అనేక శ్రీవైష్ణవులకును ఈ క్రమము తప్పకుండ రహస్యత్రయోపదేశమును చేయించి, మఱియు, ఆవిధముగా భగవద్రామానుజులు శ్రీవైష్ణవదర్శనమును నిర్వహించుచున్న సమయమునందు **"ప్రీత్యా పృథక్ పృథక్ శిష్యైః ప్రణమే దీశ్వరావధి, స్వారాధ్యం యావతా జ్ఞాతుం వాక్యం తావ దనుస్మరేత్"** (భగవానుని పర్యంతము గల

శిష్యైః ప్రభాతే పద్మసంభవే, తద్యథా విధినా నిత్యం ప్రవక్తవ్యం గురోః కులమ్” ఎన్గిఱ పడియే ఇమ్మూన్ఱు వాక్యత్తుడనే “శ్రీమతే రామానుజాయ నమః” ఎన్ఱు తొడజ్గి, “శ్రీధరాయ నమః” ఎన్గిఱ వాక్యత్తళవాన పత్తు వాక్యజ్గళైయుమ్ శేర్త్తు పదిన్మూన్ఱు వాక్యజ్గళాక ఇత్తై మేలోరాన నమ్మాచార్యర్కళ్ తన్దాముక్కు తఞ్జమాక అనుసంధిప్పదుమ్, తన్దామై ఆశ్రయిత్తార్క్కు ఉపదేశిప్పదుమ్ శెయ్యక్కడవర్కళెన్ఱు తామే ఆழ్వానైక్కొణ్డు నియమిత్తరుళి, ఇప్పడిచేతన స్వరూపత్తై పల్లవితమాక్కియుమ్, పుష్పితమాక్కియుమ్, ఫలపర్యంతమాక్కియుమ్ శెయ్దువైత్తు, “శెల్వనాయ్ తుళక్కற்றముదమాయ్” ఎన్ఱుమ్, “విజ్వరః ప్రముమోద హ” ఎన్ఱుమ్ శొల్లుకిఱ పడియే ఉళ్వెదుప్పు తీర్న్దు నిర్వృతనా యిరున్దాన్.

“అన్వయాదపి చైకస్య సమ్యక్ న్యస్తాత్మనో హరౌ, సర్వ ఏవ ప్రముచ్యంతే నరాః పూర్వే పరే తథా” ఎన్ఱుమ్, “అర్వాంచో యత్పదసరసిజద్వంద్వ మాశ్రిత్య పూర్వే,

---

ఆచార్యపరంపర శిష్యులచే భక్తితో నమస్కరింపబడవలెను. ఎంతవరకు తాను సేవింపదగినవారు కలరో అంతవరకు వారిని స్మరింపవలెను.) అనియు, **“ప్రత్యహం ప్రణతః శిష్యైః ప్రభాతే పద్మసంభవే, తద్యథా విధినా నిత్యం ప్రవక్తవ్యం గురోః కులమ్”** (పద్మమునందు పుట్టిన లక్ష్మీదేవీ! ప్రతినిత్యము ఆచార్యుని నమస్కరించు శిష్యులచే ఉదయముననే క్రమానుసారము గురుపరంపర అనుసంధింపతగినది) అనునట్లు ఈ మూడు వాక్యములతో **“శ్రీమతే రామానుజాయ నమః”** అని ప్రారంభించి, **“శ్రీధరాయ నమః”** అను వాక్యమువరకు గల దీనికి పిమ్మట పది వాక్యములను చేర్చి పదమూడు వాక్యములైన దీనిని మన ఆచార్యులు తమకు శరణముగా అనుసంధించుట, తమను ఆశ్రయించిన వారికి ఉపదేశించుటయును చేయవలెనని తామే కూరేశులనుగొని ఆజ్ఞాపించి – ఇట్లు చేతనస్వరూపమును పల్లవింపచేసి (చిగురింపచేసి), పుష్పింపచేసి, ఫలపర్యంతమొనర్చియు, (జీవలాభమను) సంపదను కలవాడై **“శెల్వనాయ్ తుళక్కற்றముదమాయ్”** అనియు, **“విజ్వరః ప్రముమోద హ”** (జ్వరము తొలగినవాడై, మిక్కిలి ఆనందించెను కదా) అనియును పల్కురీతిలో మనస్సు లోని తాపము తీరి, సంతోషించినవాడయ్యెను.

**“అన్వయాదపి చైకస్య సమ్యక్న్యస్తాత్మనో హరౌ, సర్వ ఏవ ప్రముచ్యంతే నరాః పూర్వే పరే తథా”** (భగవానుని వద్ద చక్కగా సమర్పింపబడిన మనస్సును కల్గిన ఒక ఆచార్యునితో గల సంబంధమువలన ఆ ఆచార్యునకు ముందువారు, అనంతరము వారును మోక్షమును పొందుచున్నారు) అనియు, **“అర్వాంచో యత్పదసరసిజద్వంద్వ**



మూర్ధ్నా యస్యాన్వయ ముపగతా దేశికా ముక్తి మాపుః, సోఽయం రామానుజముని రపి స్వీయముక్తిం కరస్థాం యత్సంబంధా దమనుత కథం వర్ణ్యతే కూరనాథః” ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే మున్బుళ్ల ముదలికళుక్కుమ్, పిన్బుళ్ల ముదలికళుక్కుమొక్క ఉత్తారకరాన ఉడైయవర్ సర్వజ్ఞరా యిరుక్కచ్చెయ్దేయుమ్, “తథాఽపి సమయాచారాన్ స్థాపయన్ సాంప్రదాయికాన్” ఎన్గిఱపడియే తమక్కు సంప్రదాయపరిశుద్ధి యుణ్డెన్ఱుమిడమ్ తోற்ற “అస్మద్గురుభ్యో నమః” ఇత్యాది వాక్యత్రయత్తైయుమ్ తామ్ అనుసంధిక్కుమ్బోదు మున్దిన (ముదల్) వాక్యత్తిల్ గురుపదప్రతిపాద్యర్ పెరియనమ్బి ఎన్ఱుమ్, అదిల్ బహువచనప్రతిపాద్యర్ తిరుక్కచ్చినమ్బియుమ్, పేరరుళాళప్పెరు మాళుమ్ ఎన్ఱుమ్, ఇరణ్డామ్ వాక్యత్తిల్ పరమగురుప్రతిపాద్యర్ ఆళవన్దార్ ఎన్ఱుమ్, అదిల్ బహువచన ప్రతిపాద్యర్ (ఆళవన్దారిన్) సబ్రహ్మచారికళాన పెరియోర్ కళెన్ఱుమ్,

---

**మాశ్రిత్య పూర్వే మూర్ధ్నా యస్యాన్వయ ముపగతా దేశికా ముక్తి మాపుః, సోఽయం రామానుజముని రపి స్వీయముక్తిం కరస్థాం యత్సంబంధా దమనుత కథం వర్ణ్యతే కూరనాథః”** (అనంతరకాలమునకు చెందినవారు భగవద్రామానుజుల పాదపద్మము లను ఆశ్రయించియు, పూర్వము జన్మించినవారు, శ్రీరామానుజుల శిరస్సంబంధము వలనను మోక్షమును పొందిరి, అట్టి రామానుజులుకూడ తమ మోక్షమును ఏ కూరేశుల సంబంధమువలన కరతలామలకముగా తలచిరో, ఆ కూరేశులను స్తుతించుట ఎట్లు సాధ్యము?) అనియును పల్కు రీతిలో ముందున్న ఆచార్యులకును, తరువాతి ఆచార్యులకును సమానముగా ఉత్తారకులైన ఉడైయవర్ సర్వజ్ఞులైయున్నను, **“తథాపి సమయాచారాన్ స్థాపయన్ సాంప్రదాయికాన్”** (అట్లయినను సాంప్ర దాయికములైన ధర్మము, ఆచారములను స్థాపించుచు) అనునట్లు తమకు సంప్రదాయ పరిశుద్ధి కలదను విషయము స్ఫురించునట్లు **“అస్మద్గురుభ్యో నమః”** ఇత్యాది వాక్యత్రయమును తాము అనుసంధించునపుడు ముందు వాక్యములోని గురుపదముచే ప్రతిపాదింపబడువారు పెరియనమ్బి అనియు, అందలి బహువచనప్రతిపాద్యులు తిరుక్కచ్చినమ్బి, పేరరుళాళప్పెరుమాళ్ (వరదరాజస్వామి) అనియు, రెండవ వాక్యములో పరమగురు పదముచే తెలుపబడువారు ఆళవన్దార్ అని, అందలి బహువచన ప్రతిపాద్యులు (ఆళవందార్ల) సబ్రహ్మచారులైన పెద్దలు అనియు, మూడవ వాక్యములో సర్వశబ్ద గురుపద బహువచన ప్రతిపాద్యులు మణక్కాల్నమ్బి మొదలగు పిమ్మట గల ఆచార్యులు అనియు గ్రహింపనగును.

మూన్ఱామ్ వాక్యత్తిల్ గురుపద సర్వశబ్దబహువచన ప్రతిపాద్యర్ మణక్కాల్‌నమ్బి తొడక్కమాన మేలోరెల్లారుమ్ ఎన్ఱుమ్ కణ్డుకొళ్వదు.

అప్పడియే, ఉడైయవరుక్కు మున్బుళ్ళ ముదలికళిల్ వైత్తుక్కొణ్డు పెరియనమ్బి ఇవ్వాక్యత్రయత్తై అనుసంధిక్కుమ్బోదు, మున్దిన వాక్యత్తిల్ గురుప్రతిపాద్యర్ ఆళవన్దార్ ఎన్ఱుమ్, ఇరణ్డామ్ వాక్యత్తిల్ పరమగురుప్రతిపాద్యర్ మణక్కాల్‌నమ్బి ఎన్ఱుమ్, ఇరణ్డిలుమ్ బహువచన ప్రతిపాద్యర్ ఇవర్‌కళుక్కు గురూపసత్తియిలే రుచియై జనిప్పిత్త శ్రీవైష్ణవర్‌కళుమ్, అవర్‌కళోడు సంగతియై ఉణ్డాక్కిన ఈశ్వరనుమ్ ఎన్ఱుమ్, మూన్ఱామ్ వాక్యత్తిల్ గురుపదసర్వశబ్దబహువచన ప్రతిపాద్యర్ ఉయ్యక్కొణ్డార్ తొడజ్గి శ్రియః పతియళవాయుళ్ళ అనైవరుమెన్ఱు కణ్డుకొళ్వదు.

అప్పడియే, ఆళవన్దార్ ఇవ్వాక్యత్రయత్తైయుమ్ అనుసంధిక్కుమ్బోదు, గురుపదప్రతిపాద్యర్ మణక్కాల్‌నమ్బియెన్ఱుమ్, ద్వితీయవాక్యత్తిల్ పరమగురుప్రతి పాద్యర్ ఉయ్యక్కొణ్డార్ ఎన్ఱుమ్, ఇరణ్డిలుమ్ బహువచన ప్రతిపాద్యర్ యథాసంభవమ్ ఇదిల్ రుచియై ప్పిఱప్పిత్త శ్రీవైష్ణవర్‌కళుమ్, ఈశ్వరనుమ్ ఎన్ఱుమ్, మూన్ఱామ్ వాక్యత్తిల్ గురుపద సర్వశబ్దబహువచన ప్రతిపాద్యర్ శ్రీమన్నాథమునికళ్ తొడజ్గి శ్రీధరన్ అళవుళ్ళ అనైవరుమ్ ఎన్ఱు కణ్డుకొళ్వదు.

---

అట్లే, ఉడైయవర్‌కు ముందుగల ఆచార్యులలో పెరియనమ్బి ఈ వాక్యత్రయమును అనుసంధించునపుడు, ముందు వాక్యములోని గురుశబ్దముచే తెలుపబడువారు ఆళవన్దార్ అనియు, రెండవ వాక్యములోని పరమగురుపదముచే తెలుపబడువారు మణక్కాల్‌నమ్బి అనియు, రెండిటిలోను బహువచనప్రతిపాద్యులు వీరికి గురు సమాశ్రయణములో రుచిని కల్గించిన శ్రీవైష్ణవులు అని, వారితో సంబంధమును కల్గించిన భగవానుడును అనియు, మూడవ వాక్యములో గురుపదసర్వశబ్దబహువచన ప్రతిపాద్యులు ఉయ్యక్కొణ్డార్‌నుండి మొదలిడి భగవానునివరకు గల అందఱును అని గమనింపనగును.

అట్లే, ఆళవన్దార్ ఈ వాక్యత్రయమును అనుసంధించునపుడు, గురుపదముచే చెప్పబడువారు మణక్కాల్‌నమ్బి అనియు, ద్వితీయవాక్యములో పరమగురుపదముచే తెలుపబడువారు ఉయ్యక్కొణ్డార్ అనియు, రెండు వాక్యములయందు బహువచనముచే చెప్పబడువారు యథాసంభవముగా ఇందు రుచిని కల్గించిన శ్రీవైష్ణవులును, భగవానుడును అనియు, మూడవ వాక్యములో గురుపదసర్వశబ్దబహువచన ప్రతి పాద్యులు శ్రీమన్నాథమునులనుండి భగవానునివరకు గల అందఱును అని గమనింప నగును.



అప్పడియే మణక్కాల్‌నమ్బి ఇవ్వాక్యత్రయత్తైయుమ్ అనుసంధిక్కుమ్బోదు ప్రథమద్వితీయవాక్యస్థగురుపరమగురుప్రతిపాద్యర్ ఉయ్యక్కొణ్డారుమ్, నాథమునికళుమ్ ఎన్ఱుమ్, ఇరణ్డిలుమ్ బహువచనప్రతిపాద్యర్ యథాసంభవ మిత్తై ఇశైవిప్పిత్త శ్రీవైష్ణవర్‌కళుమ్, ఈశ్వరనుమ్ ఎన్ఱుమ్, తృతీయవాక్యస్థ గురుపదసర్వశబ్ద బహువచన ప్రతిపాద్యర్ నమ్మాழ్వార్ తొడక్కమానారెల్లారుమ్ ఎన్ఱుమ్ కణ్డుకొళ్వదు.

అప్పడియే, ఉయ్యక్కొణ్డార్ ఇవ్వాక్యత్రయత్తైయుమ్ అనుసంధిక్కుమ్బోదు ఆదిమధ్యవాక్యగతగురు-పరమగురుపద ప్రతిపాద్యర్ నాథమునికళుమ్, ఆழ్వారుమ్ ఎన్ఱుమ్, ఇరణ్డిలుమ్ బహువచనప్రతిపాద్యర్ యథాసంభవమ్ ఇదిల్ ప్రేమత్తై జనిప్పిత్త పెరియోర్‌కళుమ్, ఎమ్బెరుమానుమ్ ఎన్ఱుమ్, తృతీయవాక్యగత గురుపదసర్వశబ్ద బహువచనప్రతిపాద్యర్ సేనైముదలియార్ తొడక్కమాన మేలోర్‌అనైవరుమ్ ఎన్ఱుమ్ కణ్డుకొళ్వదు.

అప్పడియే, నాథమునికళ్ ఇవ్వాక్యత్రయత్తైయుమ్ అనుసంధిక్కుమ్బోదు, ప్రథమద్వితీయవాక్యగత గురుపరమగురుపద ప్రతిపాద్యర్ ఆழ్వారుమ్, సేనైముదలి

---

ఆ విధముగానే, మణక్కాల్‌నమ్బి ఈ వాక్యత్రయమును అనుసంధించునపుడు, మొదటి, రెండవ వాక్యములలోని గురు-పరమగురుప్రతిపాద్యులు ఉయ్యక్కొణ్డార్, నాథముని అనియు, రెండు వాక్యములలోని బహువచనముచే ప్రతిపాదింపబడువారు యథాసంభవముగా దీనిని అంగీకరింపచేసిన శ్రీవైష్ణవులును, భగవానుడును అని, మూడవ వాక్యములోని గురుపద సర్వశబ్దములచే, బహువచనముచే ప్రతిపాద్యులు నమ్మాழ్వార్లనుండి గల అందఱును అని గమనింపనగును.

అట్లే, ఉయ్యక్కొణ్డార్ ఈ వాక్యత్రయమును అనుసంధించునపుడు, మొదటి, మధ్య, వాక్యములందున్న గురు-పరమగురుపదములచే ప్రతిపాదింపబడువారు నాథమునులును, ఆழ్వార్లును అనియు, రెండిటిలో బహువచనప్రతిపాద్యులు యథాసంభవము ఇందు ప్రేమను కల్గించిన పెద్దలు, భగవానుడును అనియు, మూడవ వాక్యములోని గురుపదసర్వశబ్ద బహువచనప్రతిపాద్యులు సేనైముదలియార్‌నుండి పైననున్న అందఱును అని గమనింపతగినది.

ఆ రీతిలోనే నాథమునులు ఈ వాక్యత్రయమును అనుసంధించునపుడు ప్రథమ ద్వితీయ వాక్యములలోని గురు-పరమగురు పదములచే నిర్దేశింపబడువారు ఆழ్వార్లును, సేనైముదలియార్‌ను అనియు, రెండిటిలోను బహువచనముచే నిర్దేశింపబడువారు

యారుమ్ ఎన్నుమ్, ఇరణ్డిలుమ్ బహువచన ప్రతిపాద్యర్ తత్సంబంధఘటకరాన శ్రీవైష్ణవర్కళుమ్, ఎమ్బెరుమానుమ్ ఎన్నుమ్, తృతీయవాక్యగతగురుపదసర్వశబ్ద బహువచన ప్రతిపాద్యర్ పిరాట్టియుమ్, ఎమ్బెరుమానుమ్, మఱ్ఱుమ్ అజ్గుళ్ళార్ అనైవరుమెన్నుమ్ కణ్డుకొళ్వదు.

అప్పడియే ఆఴ్వారుమ్ ఇవ్వాక్యత్రయత్తై అనుసంధిక్కుమ్బోదు ప్రథమ, ద్వితీయ వాక్యగతగురుపరమగురుపదప్రతిపాద్యర్ సేనైమొదలియార్, పిరాట్టియుమ్ ఎన్నుమ్, ఇరణ్డిలుమ్ బహువచనప్రతిపాద్యర్ ఇవ్విరువర్క్కుమ్ ఉయిర్నిలైయా యిరుప్పవర్ శిలర్ ఎన్నుమ్, తృతీయవాక్యగత గురుపద సర్వశబ్దబహువచనప్రతిపాద్యర్ సర్వేశ్వరనుమ్, వ్యూహముమ్, విభవముమ్, నిత్యసూరికళుమ్ ఎన్నుమ్ కణ్డుకొళ్వదు.

ఇప్పడియే, సేనైముదలియారుమ్ ఇవ్వాక్యత్రయత్తైయుమ్ అనుసంధిక్కుమ్బోదు, ప్రథమద్వితీయవాక్యగత గురుపరమగురుప్రతిపాద్యర్ పిరాట్టియుమ్, విష్ణువాక అవతారమాన ఎమ్బెరుమానుమ్ ఎన్నుమ్, ఇరణ్డిలుమ్ బహువచనప్రతిపాద్యర్ అవళుక్కు స్తనబాహుదృష్టిస్థానీయరుమాన మఱ్ఱైప్పిరాట్టిమారుమ్; అవనడిమై కొళ్ళుకిఱ మఱ్ఱై అమరర్కళ్తాజ్గళుమ్ ఎన్నుమ్, తృతీయవాక్యగత గురుపదసర్వశబ్దబహువచన

---

ఆ సంబంధమును కలుగజేయువారగు శ్రీవైష్ణవులును, భగవానుడును అనియు, తృతీయ వాక్యములోని గురుపదసర్వశబ్దబహువచనములచే తెలుపబడువారు లక్ష్మీదేవి, భగవద్రామానుజులు, మఱియు అచటనున్న అందఱును అని గమనింపనగును.

ఆ రీతిలోనే, నమ్మాఴ్వార్లును ఈ వాక్యత్రయమును అనుసంధించునపుడు మొదటి, రెండవ వాక్యములందలి గురు–పరమగురుపదప్రతిపాద్యులు సేనైముదలి యార్లు, లక్ష్మీదేవియు, రెండిటియందు బహువచనముచే ప్రతిపాదింపబడువారు, ఈ ఇద్దరుకును ప్రాణస్థానీయులై ఉన్న కొందరు అని, మూడవ వాక్యములోని గురుపద సర్వశబ్దబహువచన ప్రతిపాద్యులు సర్వేశ్వరుడు, వ్యూహము, విభవమును, నిత్యసూరు లును అని గమనింపతగును.

ఆ విధముగానే, సేనైముదలియార్ (విష్వక్సేనులు) ఈ వాక్యత్రయమును అను సంధించునపుడు మొదటి, రెండవ వాక్యములందలి గురు – పరమగురుపద ప్రతిపాద్యులు లక్ష్మీదేవి, విష్ణువు రూప అవతారమగు భగవానుడును అని, రెండిటి యందు బహువచనముచే తెలుపబడువారు ఆమెకు స్తన–బాహు–దృష్టి స్థానీయలగు మిగిలిన దేవేరులును, సర్వేశ్వరుడు కైంకర్యమును స్వీకరించు మిగిలిన నిత్యసూరులును



ప్రతిపాద్యర్ ఇవ్వవతారత్తుక్కు నాఱ్ఱజ్గాలాన క్షీరార్ణవనికేతనుమ్, మఱ్ఱుమ్ వ్యూహావతారజ్గళుమ్, శ్వేతద్వీపవాసికళుమ్ ఎన్నుమ్ యథాసంభవమ్ ఇప్పుడైకళిలే ఇవఱ్ఱుక్కు ప్పొరుళ్ శొల్లక్కడవదు.

అప్పడియే, పిరాట్టి ఇవ్వాక్యత్రయత్తైయుమ్ అనుసంధిక్కుమ్ పోదు ఆదిమధ్యవాక్యగత గురుపరమగురుపదప్రతిపాద్యర్ విష్ణు అవతారముమాన ఎమ్బెరు మాన్తానుమ్, అవ్వవతార కన్దమాన వ్యూహవాసుదేవనుమ్ ఎన్నుమ్, ఇరణ్డిలుమ్ బహువచనప్రతిపాద్యర్ పెరియతిరువడి తొడక్కమానారుమ్, సంకర్షణానిరుద్ధ ప్రద్యుమ్నర్కళ్ ఎన్నుమ్, తృతీయవాక్యగతగురుపద సర్వశబ్దబహువచనప్రతిపాద్యర్ “వానిలవరశు వైకున్దకుట్ట”నుమ్, “ఓడుమ్ పుళ్లేఱి” యిల్పడియే ఇచ్చేతననుక్కాక ఇవ్విభూతియిలే అవన్ పరిగ్రహిక్కుమ్ శిల అవతారజ్గళుమ్, నిత్యసిద్ధరుమ్ ఎన్నుమ్ యథాసంభవమ్ ఇప్పుడైకళిలే ఇవఱ్ఱుక్కు ప్పొరుళ్ శొల్లక్కడవదు.

---

అనియు, మూడవ వాక్యములోని గురుపదసర్వశబ్దములచే, బహువచనముచే ప్రతిపాదింపబడువారు ఈ అవతారమునకు మూలమగు క్షీరార్ణవనికేతనుడును, మఱియు వ్యూహావతారములును, శ్వేత ద్వీపవాసులును అని యథాసంభవముగా ఈ విధముగా వీనికి అర్థము చెప్పనగును.

అట్లే, లక్ష్మీదేవి ఈ వాక్యత్రయమును అనుసంధించునపుడు మొదటి–మధ్య వాక్యములలోని గురు–పరమగురుపదప్రతిపాద్యులు విష్ణుఅవతారమైన భగవానుడును, ఆ అవతారకన్దమైన వ్యూహవాసుదేవుడు అనియు, రెండిటియందు బహువచనముచే తెలుపబడువారు పెరియతిరువడి (గరుత్మంతుడు) మొదలగువారును, సంకర్షణ–అనిరుద్ధ–ప్రద్యుమ్నులు అనియును, తృతీయ వాక్యములోని గురుపద– సర్వశబ్దముల లోని బహువచన ప్రతిపాద్యులు పరమపదనాథుడగు వైకుంఠములోని కుర్రవాడును (భగవానుడు), **“ఓడుమ్ పుళ్లేఱి”** అను దశకములో తెలుపబడిన విధముగా ఈ జీవుని (రక్షణ) కొఱకు ఈ విభూతిలో అతడు పరిగ్రహించు కొన్ని అవతారములును, నిత్యసిద్ధులును అని యథాసంభవముగా ఈ క్రమములో దీనికి అర్థము తెలుపనగును.

ప్రథమావతారమగు విష్ణు అవతారము, ఆ అవతారకందమైన పాలసముద్ర ములో ఆదిశేషునిపై పరుండియున్న పరమాత్మయు, వైకుంఠనివాసియు, ధర్మైక్యము వలన భేదము లేకుండ ఏకతత్త్వమై ఉన్నవి అయినను, శ్రీరంగనాథునకు, శ్రీరామునకు

ప్రథమావతారమాన విష్ణ్వవతారముమ్, అవ్వవతారకన్దమాన "పాఱ్కడలుళ్ పైయత్తుయిన్ఱ పరమను"మ్, వైకున్దవానాడునివాసియుమ్, ధర్మ్యైక్యత్తాలే భేదమిన్ఱిక్కే ఏకతత్త్వమాయ్ ఇరున్దవర్కళేయాకిలుమ్ పెరియపెరుమాళుక్కుమ్, పెరుమాళుక్కుమ్ ధర్మ్యైక్యమ్ ఇరుక్కచ్చెయ్దే "నారాయణ ముపాగమత్" ఎన్ఱు విగ్రహాభేదత్తాలే ఉపగన్తృత్వ ఉపగన్తవ్యజ్గళైచ్చొన్నవోపాది ఇవ్విడత్తిలుళ్ల విగ్రహాభేదత్తై యిట్టు ఇమ్మూవర్క్కుమ్ ఇజ్గనే గురుత్వ, పరమగురుత్వసర్వగురుత్వజ్గళై చ్చొల్ల క్కుఱైయిల్లై.

ఉడైయవరుక్కు ప్పిన్బుళ్ల ముదలికళిల్ వైత్తుక్కొణ్డు "రామానుజపదచ్ఛాయా" ఎన్నుమ్బడి అవర్ తిరువడికళిలే యాశ్రయిత్తవర్కళుక్కు "నిழలు మడితాఱు"మాయ్ క్కొణ్డు గురుపరంపరానుప్రవిష్ఠమాన ఎమ్బార్ ఇవ్వాక్యత్రయత్తైయుమ్ అనుసంధిక్కుమ్బోదు అదిల్ గురుపరమగురుసర్వగురుపద బహువచనప్రతిపాద్యర్ ఎమ్బెరుమానార్, పెరియనమ్బియుడన్ గోబలీవర్దన్యాయత్తాలే పిళ్ళానుమ్, ఆழ్వానుమ్, ఆణ్డానుమ్, అనన్దాழ్వానుమ్ ఎన్ఱుమ్, అవర్కళుక్కు అభిమతరాయిరున్దుళ్ల శ్రీవైష్ణవర్కళెన్ఱు పూర్వమ్ పోలే ఇజ్గనే విభజిత్తు ప్పొరుళ్ శొల్లక్కడవదు.

అప్పడియే, ఎమ్బార్తిరువడికళిల్ ఆశ్రయిత్త భట్టర్ ఇవ్వాక్యత్రయత్తైయుమ్ అనుసంధిక్కుమ్బోదు, ఇదిల్ గురు–పరమగురు–సర్వగురుపద బహువచనప్రతిపాద్యర్

---

ధర్మ్యైక్యమున్నను **"నారాయణ ముపాగమత్"** (నారాయణుని ఆశ్రయించెను) అనునట్లు రూపభేదముచే వారికి ఉపగంతృత్వ–ఉపగంతవ్యములను (ఆశ్రయించువాడగుటను – ఆశ్రయింపబడవాడగుటను) చెప్పిన రీతిలో, ఈ విషయమునందు గల రూపభేదమును పురస్కరించుకొని ఈ ముగ్గురకును (విభవ–వ్యూహ–పరరూపములకును) ఇట్లు గురుత్వ, పరమగురుత్వ–సర్వగురుత్వములను పల్కుటలో విరోధము లేదు.

భగవద్రామానుజులకు అనంతరముగల ఆచార్యులలో **"రామానుజపదచ్ఛాయా"** (భగవద్రామానుజుల పాదచ్ఛాయ) అనునట్లు వారి శ్రీపాదములందు ఆశ్రయించిన వారికి చ్ఛాయయై, పాదుకయై, గురుపరంపరలో అన్వయమునుకల ఎమ్బార్ ఈ వాక్యత్రయమును అనుసంధించునపుడు,అందు గురు–పరమగురు– సర్వగురుపదముల లోని బహువచన ప్రతిపాద్యులు భగవద్రామానుజులు, పెరియనమ్బితోపాటు గోబలీవర్ధన్యాయముతో పిళ్లాన్, కూరేశులు, ముదలియాణ్డాన్, అనందాழ్వాన్ అనియు, వారికి ఇష్టులైయున్న శ్రీవైష్ణవులును అని పూర్వమువలె ఇట్లు విభజించి, అర్థమును చెప్పనగును.



అడైవే ఎమ్బారుమ్, ఆழ్వానుమ్, ఆణ్డానుమ్, పిళ్ళానుమ్, ఎమ్బెరుమానారుమ్, అవర్కళుక్కు అంతరంగరాయ్ ఇరున్దుళ్ల శ్రీవైష్ణవర్కళుమ్ ఎన్ఱుమ్ పూర్వమ్పోలే ఇజ్గనమ్ విభజిత్తు ప్పొరుళ్ శొల్లక్కడవదు.

అప్పడియే, భట్టర్ తిరువడికళైయాశ్రయిత్త నఞ్జీయర్ ఇవ్వాక్యత్రయత్తైయుమ్ అనుసంధిక్కుమ్బోదు, ఇదిల్ గురు–పరమగురు–సర్వగురుపద బహువచనప్రతిపాద్యర్ భట్టరుమ్, ఆழ్వానుమ్, ఎమ్బారుమ్, పిళ్ళాన్, ఆణ్డాన్ తొడక్కమానారుమ్, ఎమ్బెరుమానారుమ్, మఱ్ఱుమ్ పెరియోర్కళుమ్ ఎన్ఱుమ్ పూర్వమ్పోలే యథా సంభవమ్ ఇజ్గనే విభజిత్తు ప్పొరుళ్ శొల్లక్కడవదు.

పిన్నైయుమ్ అప్పడియే, నఞ్జీయర్ తిరువడికళిలే ఆశ్రయిత్త నమ్బిళ్లై ఇమ్మూన్ఱు వాక్యత్తైయుమ్ అనుసంధిక్కుమ్బోదు ఇదిల్ గురు–పరమగురు–సర్వగురు పదబహు వచన ప్రతిపాద్యర్ నఞ్జీయరుమ్, భట్టరుమ్, ఎమ్బారుమ్, పిళ్లానుమ్, అవర్కళుక్కు సబ్రహ్మచారికళాయ్, బహుమంతవ్యరాయ్ ఇరున్దుళ్ల "ఇరామానుశనై త్తొழుమ్ పెరియోర్" కళెన్ఱుమ్ ఇజ్గనే విభజిత్తు ప్పొరుళ్ శొల్లక్కడవదు.

---

అట్లే, ఎమ్బార్ శ్రీపాదములను ఆశ్రయించిన భట్టర్ ఈ వాక్యత్రయమును అనుసంధించునపుడు, ఇందు గురు–పరమగురు–సర్వగురు పదములలోని బహువచనము వలన ప్రతిపాదింపబడువారు క్రమముగా ఎమ్బార్, కూరేశులు, ఆణ్డాన్ను, పిళ్లాన్, శ్రీరామానుజులును, వారికి అంతరంగులైయున్న శ్రీవైష్ణవులును అని పూర్వమువలె ఇట్లు విభజించి అర్థమును చెప్పనగును.

అట్లే, భట్టర్ తిరువడిగళ్లను ఆశ్రయించిన నఞ్జీయర్ ఈ మూడు వాక్యములను అనుసంధించునపుడు, ఇందలి గురు–పరమగురు–సర్వగురుపద బహువచన ప్రతి పాద్యులు భట్టరు, ఆழ్వాన్, ఎమ్బార్, పిళ్లాన్, ఆణ్డాన్ మొదలగువారు (భగవద్రామా నుజులును), మరియు పెద్దలును అని పూర్వమువలె యథాసంభవముగా ఇట్లు విభజించి అర్థమును చెప్పనగును.

మఱియు అట్లే, నఞ్జీయర్ శ్రీపాదములందు ఆశ్రయించిన నమ్బిళ్ళై ఈ మూడు వాక్యములను అనుసంధించునపుడు ఇందు గురు–పరమగురు–సర్వగురు పదములలోని బహువచనములచే ప్రతిపాద్యులు నఞ్జీయర్, భట్టర్, ఎమ్బార్, పిళ్ళాన్ వారికి సబ్రహ్మచారులై, గౌరవనీయులైయున్న భగవద్రామానుజులను సేవించు పెద్దలు అని ఇట్లు విభజించి అర్థమును చెప్పనగును.

ఇగ్గురుపరంపరైత్తాన్–ఆరోహణక్రమత్తిలే "ఆచార్యాణా మసావసావిత్యాభగవత్తః" ఎన్ఱు భగవానళవుమ్ శెన్ఱు, అవ్వరుకిట్చొల్లక్కడవదొన్ఱన్ఱు. ఇఙ్గనే ఇరున్దాలుమ్, అవరోహణ క్రమత్తిలే వన్దాల్ "ఇరామానుశన్‌తాళ్ పిడిత్తార్ పిడిత్తారై ప్పత్‌ఱి" ఇత్యాదిప్పడియే మేన్మేలెన కొళ్ళున్దువిట్టు ప్పకిర్‌న్దు శెల్లక్కడవదొన్ఱు. ఆకైయాలే, నమ్బిళ్ళై తిరువడికళిలే ఆశ్రయిత్త వడక్కుత్తిరువీధిప్పిళ్ళైయుమ్, అవర్‌తిరువడికళిలే ఆశ్రయిత్త పిళ్ళైలోకాచార్యరుమ్, అవర్ తిరువడికళిలే ఆశ్రయిత్త తిరువాయ్ మొళిప్పిళ్ళైయుమ్, అవర్ తిరువడికళిలే ఆశ్రయిత్త పెరియజీయరుమ్ ఇవ్వాక్యత్రయత్తైయుమ్ అనుసంధిక్కుమ్బోదు, ఇవ్వాక్యత్రయే గురు–పరమగురు–సర్వగురుపదబహు వచనప్రతిపాద్యర్ ఇన్నార్ ఇన్నార్ ఎన్నుమిడమ్ ఆచార్యర్‌కళుడైయ తిరునామఙ్గళిలే కణ్డుకొళ్వదు. అప్పడియే బహువచనప్రతిపాద్యర్ అవర్‌కళుక్కు ఉయిర్‌నిలైయాయ్, త్తన్దాముక్కు బహుమంతవ్యరాయ్, కొడియై కొళ్‌కొమ్బిలే తువక్కుమ్బోదు శుళ్ళిక్కాల్‌పోలే తన్దామై అవ్వవర్‌కళ్ తిరువడికళిలే శేర్‌క్కుమ్ శ్రీవైష్ణవర్‌కళెన్ఱుమ్ కణ్డుకొళ్వదు.

ఇని, "శ్రీమతే రామానుజాయ నమః" ఇత్యాది దశకత్తిలుమ్ వైత్తుకొణ్డు "శ్రియై నమః, శ్రీధరాయనమః" ఎన్గిఱ వాక్యద్వయత్తిల్ "శ్రీరితి ప్రథమాభిధానం లక్ష్మ్యాః"

---

ఈ గురుపరంపర ఆరోహణక్రమములో **"ఆచార్యాణా మసా వసా విత్యాభగవత్తః"** అని భగవానుని పర్యంతము పోయి, ఆ అవధికి మించి చెప్పదగినది కాదు. ఇట్లున్నను, ఆరోహణక్రమమునందు వచ్చినచో, **"ఇరామానుశన్ తాళ్ పిడిత్తార్ పిడిత్తారై ప్పత్‌ఱి"** (శ్రీరామానుజుల పాదములను ఆశ్రయించినవారిని ఆశ్రయించిన వారిని ఆశ్రయించి) అను రీతిలో పైపైకి వృద్ధిజెంది విస్తరింపదగినదైయున్నది. కావున నమ్బిళ్ళై శ్రీపాదములను ఆశ్రయించిన వడక్కుత్తిరువీధిప్పిళ్ళై, వారి శ్రీపాదములను ఆశ్రయించిన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు, వారి శ్రీపాదములను ఆశ్రయించిన తిరువాయ్‌మొళిప్పిళ్ళై, వారి శ్రీపాదములను ఆశ్రయించిన శ్రీవరవరమునులు ఈ వాక్యత్రయమును అనుసంధించునపుడు ఈ వాక్యత్రయమునందు గురు–పరమగురు–సర్వగురు పదములందు బహువచనప్రతిపాద్యులు వీరు, వీరు అను విషయమును ఆచార్యుల తిరునామములలో గమనింపనగును. అట్లే, బహువచనప్రతిపాద్యులు వారికి ప్రాణస్థానీయులై, తమకు మిక్కిలి గౌరవనీయులై, తీగను ఉపఘ్నమందు చేర్చునపుడు సహకారముగానుండు ఆధారమువలె (అంటు తీగలవలె), తమను వారి శ్రీ పాదము లందుచేర్చు శ్రీవైష్ణవులని గమనింపనగును.



ఎన్ఱుమ్, "శ్రీరిత్యేవ చ నామతే" ఎన్ఱుమ్ శొల్లుకైయాలే శ్రీశబ్దమ్ పెరియపిరాట్టియారుక్కు వాచకమాయిరుక్కుమ్. "శ్రియం ధరతీతి శ్రీధరః" ఎన్ఱు యోగవ్యుత్పత్తియాలే ఎమ్బెరుమానుక్కు త్తిరునామమాయిరుక్కుమ్. మత్‌ఱై ఎట్టు వాక్యత్తిలుమ్ శ్రీశబ్దమ్ "న జ్ఞానతుల్యమ్ ధన మస్తి కించిత్" ఎన్ఱుమ్, "భగవద్భక్తి రేవాత్ర ప్రపన్నానాం మహాధనమ్" ఎన్ఱుమ్ శొల్లుకైయాలే జ్ఞానభక్తికళాకిఱ మహాసంపత్తుక్కు వాచకమాయిరుక్కుమ్.

ఇదిల్ శిల వాక్యఙ్గళిల్ శ్రీశబ్దమ్ సవిభక్తికమతుప్ప్రత్యయోపేతమాయుమ్, శిల వాక్యఙ్గళిల్ లుప్తవిభక్తికమతుప్ప్రత్యయోపేతమాయుమ్, శిల వాక్యఙ్గళిల్ మతుప్ ప్రత్యయరహితమాయుమ్. ఇఙ్గనే స్వరూపేణ నిర్దేశిక్కైక్కు నిబంధనమ్ – శిలరుడైయ జ్ఞానభక్తికళ్ విశదతమఙ్గళాయ్, శిలరుడైయ జ్ఞానభక్తికళ్ విశదతరఙ్గళాయ్, శిలరుడైయ జ్ఞానభక్తికళ్ విశదఙ్గళాయ్ ఇరుక్కైయాలే. అదు ఎఙ్గనే ఎన్నిల్.

---

ఇక, **"శ్రీమతే రామానుజాయ నమః"** అను మొదలగు పది వాక్యములందు **"శ్రియై నమః, శ్రీధరాయ నమః"** అను వాక్యద్వయములో **"శ్రీ రితి ప్రథమాభిధానం లక్ష్మ్యాః"** (శ్రీ అని లక్ష్మీదేవియొక్క మొదటి నామము) అనియు, **"శ్రీరిత్యేవ చ నామ తే"** (శ్రీ అనియే నీ నామము) అనియు పల్కుటచే శ్రీశబ్దము లక్ష్మీదేవికి వాచకమైయుండును. **"శ్రియం ధరతీతి శ్రీధరః"** (లక్ష్మిని ధరించువాడు కావున శ్రీధరుడు) అను యోగవ్యుత్పత్తిచే శ్రీధరశబ్దము భగవానునకు నామమై యుండును. మిగిలిన ఎనిమిది వాక్యములందు శ్రీశబ్దము **"న జ్ఞాన తుల్యమ్ ధన మస్తి కించిత్"** అనియు, **"భగవద్భక్తి రేవాత్ర ప్రపన్నానాం మహాధనమ్"** (ప్రపన్నులకు భగవద్భక్తియే గొప్ప ధనము) అనియు చెప్పబడుటచే జ్ఞానభక్తులనెడి గొప్ప సంపదకు వాచకమైయుండును.

ఇందు కొన్ని వాక్యములలో శ్రీశబ్దము సవిభక్తిక(చతుర్థీవిభక్తితోకూడిన) మతుప్ ప్రత్యయమును కల్గినదై (శ్రీమతే అని), కొన్ని వాక్యములలో విభక్తిలోపించిన మతుప్ ప్రత్యయమును కల్గినదై (శ్రీమత్ అని), కొన్నివాక్యములలో మతుప్ ప్రత్యయము లేనిదై (శ్రీ అని) యుండును. ఇట్లు (వారి వారి) స్వరూపమును తెలుపునదిగా (శ్రీ శబ్దమును) నిర్దేశించుటకు కారణము (ఏమనగా) – కొందఱి జ్ఞానభక్తులు విశదతమములై, కొందఱి జ్ఞానభక్తులు విశదతరములై, కొందఱి జ్ఞానభక్తులు విశదములైయుండుటచే. అది ఎట్లు? అనినచో–

“పఙ్గయత్తాళ్ తిరువడి”యై ప్పఱ్ఱిన సేనైముదలియారుడైయవుమ్, అవర్ “అడిక్కణ్ణి శూడియ” ఆళ్వారుడైయవుమ్, “అవర్ అడిపణిన్దుయర్న్ద” ఉడైయ వరుడైయవుమ్ జ్ఞానభక్తికళ్ విశదతమఙ్గళాయిరుక్కుమ్. “తిరుక్కురుకూర్ నమ్బిక్కన్బ”రాన నాథమునికళుడైయవుమ్, తద్విషయీకారపాత్రభూతరాన యమునైత్తుఱైవరుడైయవుమ్ జ్ఞానభక్తికళ్ విశదతరఙ్గళా యిరుక్కుమ్. “శీలమికు నాదముని” శీరురైప్పోరాన ఉయ్యక్కొణ్డారుడైయవుమ్, తచ్ఛిష్యరాన మణక్కాల్నమ్బి యుడైయువుమ్, తత్ప్రశిష్యరాన పెరియనమ్బియుడైయవుమ్ జ్ఞానభక్తికళ్ విశదఙ్గళాయిరుక్కుమ్.

ఇవర్కళుడైయ జ్ఞానభక్తికళ్ ఏకరూపమాయిరాదే, ఇఙనే తరతమభావేన ఇరుక్కైక్కు హేతువేదెన్నిల్, సేనైముదలియారుడైయవుమ్, ఆళ్వారుడైయవుమ్ జ్ఞానభక్తికళ్ తామ్ ప్రపత్తిమార్గత్తై విష్వక్సేనసంహితైయిలే పరక్క దర్శిప్పిక్కైక్కుమ్, ప్రపత్తవ్యనాన ఎమ్బెరుమాన్ పడికళై ఉళ్లపడి అనైవరుక్కుమ్ అఱివిక్కైక్కుమ్; అప్పడియే, “ప్రియేణ సేనాపతినా నివేదితమ్ తథాఽనుజానన్త ముదారవీక్షణైః” ఎన్ఱు

---

**“పఙ్గయత్తాళ్ తిరువడి”** (లక్ష్మీదేవి శ్రీపాదములను) ఆశ్రయించిన సేనైముదలియార్‌యొక్క, వారి పాదపద్మమును అలంకరించుకొనిన ఆళ్వార్లయొక్క, వారి శ్రీపాదములను ఆశ్రయించిన ఉడైయవర్‌యొక్క జ్ఞానభక్తులు విశదతమములై యుండును. తిరుక్కురుకూర్‌నమ్బికి భక్తులైన నాథమునులయొక్క, వారి దయకు పాత్రులైన శ్రీయామునులయొక్క జ్ఞానభక్తులు విశదతరములైయుండును. గొప్ప శీలమును కల నాథమునియొక్క కల్యాణగుణములను ప్రస్తుతించు ఉయ్యక్కొణ్డార్ యొక్క, వారి శిష్యులగు మణక్కాల్‌నమ్బియొక్క, వారి ప్రశిష్యులగు పెరియనమ్బియొక్క జ్ఞానభక్తులు విశదములైయుండును.

వీరి జ్ఞానభక్తులు ఒకే విధముగానుండక, ఇట్లు తరతమభావమును కల్గియుండుటకు హేతువేమి? అనినచో, సేనైముదలియార్‌యొక్కయు, ఆళ్వార్ల యొక్కయు జ్ఞానభక్తులు ప్రపత్తిమార్గమును విష్వక్సేనసంహితలో చెప్పినట్లు విస్తృతముగా తెలుపుటచేతను, ఆశ్రయింపతగినవాడగు భగవానుని రీతులను యథావస్థితముగా అందఱికిని తెలుపుటచేతను, అట్లే, **“ప్రియేణ సేనాపతినా నివేదితమ్ తథాఽనుజానన్త ముదారవీక్షణైః”** (తనకు ప్రియమైనవాడగు సేనాపతిచే నివేదింపబడిన దానిని ఆవిధముగా (కీగంటిచూపులతో అంగీకరించువానిని) అని జ్ఞానమును కలవారు పల్కునట్లు, అతని (భగవానుని) మూలముగా అవతరించిన తిరువాయ్



మదియుడైయార్ శొల్లలామ్బడి అవనడియాకప్పిఱన్దవైయాన తిరువాయ్‌మొళి ముఖత్తాలే “తన్దనన్ తన తాళ్‌నిళలే” ఎన్ఱుమ్, “కళల్‌కళన్ఱి మఱ్ఱోర్ కళైకణిలఙ్గాణ్‌మిన్గళే” ఎన్ఱుమ్, “అడిక్కీళ్ అమర్న్దు పుకున్దేనే” ఎన్ఱుమ్ ప్రపత్తిమార్గత్తై ప్పలపడియాలుమ్ తమ్ముడైయ ఉక్త్యనుష్ఠానఙ్గళాలే స్పష్టమాక్కుకైక్కుమ్, “ఉయర్వఱ ఉయర్నల ముడైయవన్ .... మయర్వఱమదినల మరుళినన్”, “కణ్ణన్”, “దేవర్క్కుమ్ దేవా” ఎన్ఱుమ్ ప్రపత్తవ్యనుడైయ పడికళై పత్తుమ్ పత్తాక పఱ్ఱి యిరుక్కైక్కుమ్, “ఉమ్ముయిర్ వీడుడైయాన్”, “యానే నీ యెన్నుడైమైయుమ్ నీయే”, “తొణ్డర్ తొణ్డర్ తొణ్డన్” ఎన్ఱుమ్ ప్రాప్తావిన్ పడికళై ప్పలైవకైయాక ప్రదర్శిప్పిక్కైక్కుమ్, “పేరమర్ కాదల్ కడల్ పురైయ విళైవిత్తు” క్కొణ్డ “వెన్ కాదలురైక్కిల్ తోళీ మణ్‌తిణి ఞాలముమ్ ఏళ్ కడలుమ్ నీళ్‌విశుమ్బుమ్ కళియప్పెరిదాల్” ఎన్ఱుమ్, “శూళ్‌న్దదనిల్ పెరియ

---

మొళిద్వారా **“తన్దనన్ తన తాళ్‌నిళలే”** (తన పాదచ్ఛాయనుఅనుగ్రహించెను) అని, **“కళల్‌కళన్ది మఱ్ఱోర్ కళైకణిలఙ్గాణ్‌మిన్గళే”** (పాదములు తప్ప వేఱొక పాదములు శరణము కాదు, చూడుడు) అని, **“అడిక్కీళ్ అమర్న్దు పుకున్దేనే”** (పాదముల క్రింద అమరి, ప్రవేశించితిని) అనియు ప్రపత్తిమార్గమును పలు రీతులలో తమ ఉక్తి–అనుష్ఠానములద్వారా స్పష్టము చేయుటకును, **“ఉయర్వఱ ఉయర్నల ముడైయవన్ మయర్వఱ మదినల మరుళినన్”** (ఇంతకంటే గొప్పది లేనట్లు అత్యుత్తమమైన ఆనందగుణమును కలవాడు, భ్రమవిప్రలంభాదులు లేని, భక్తిరూపమును పొందిన జ్ఞానమును ప్రసాదించినవాడు) అని, **“కణ్ణన్”** (నిర్వాహకుడు) అని, **“దేవర్క్కుమ్ దేవా”** (నిత్యసూరులకును నాథుడు) అనియు ఆశ్రయింపదగిన భగవానుని రీతులను పదింతలుగా ఆశ్రయించియుండుటకును, **“ఉమ్ముయిర్‌వీడుడైయాన్”** (మీ ఆత్మను నివాసముగా కలవాడు) అని, **“యానే నీ ఎన్నుడైమైయుమ్ నీయే”** (నేను నీవే, నా సొత్తు నీదే) అని, **“తొణ్డర్ తొణ్డర్ తొణ్డన్”** (దాసుల దాసుల దాసుడు) అనియు ప్రాప్త అగు జీవాత్మ లక్షణములను పలు రీతులలో ప్రదర్శించుటకును, **“పేరమర్ కాదల్ కడల్ పురైయ విళైవిత్తు”** (గొప్పగానున్న భక్తిని సముద్రమువలె అపరిచ్ఛిన్నముగా వృద్ధిచేసి) **“ఎన్‌కాదలురైక్కిల్ తోళీ! మణ్‌తిణి ఞాలముమేళ్ కడలుమ్, నీళ్‌విశుమ్బుమ్ కళియప్పెరిదాల్”** (సఖీ! నా భక్తిని వివరించినచో స్థిరమైన ఈ భూలోకమును, ఏడు సముద్రములను, విస్తృతమైన ఆకాశమును ఆవరించునట్లు పెద్దది అగుటచే) అనియు, **“శూళ్‌న్దదనిల్ పెరియ ఎన్నవా”** (చుట్టియుండిన దానికంటె పెద్దదైన నా

**వెన్నవా” ఎన్నుమ్ పిరాట్టిమార్ పేచ్చాలుమ్, తమ్‌పేచ్చాలుమ్ తమ్ముడైయ ఆ*గ్రా*మైయై అతివిక్కైక్కుమ్ ఉఱుప్పాయ్ ఇరుక్కైయాలే విశదతమఙ్గళాయిరుక్కుమ్.**

**ఉడైయవరుడైయ జ్ఞానభక్తికళుమ్ “భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా” ఎన్ఱు తాముమ్, “అచ్యుతపదాంబుజయుగ్మరుక్మవ్యామోహతః” ఎన్ఱు ఆ*ళ్వా*నుమ్ అరుళిచ్చెయ్యలామ్పడియాక విరున్దవైయాయ్, గద్యత్రయశ్రీభాష్యముఖత్తాలే శరణాగతి శాస్త్రమ్, భక్తి శాస్త్రఙ్గళై అడైవే వెళియిడుకైక్కుమ్ “అవ్వ*ళి*యిల్ మఱ్ఱైయిల్ శేరాదవరై చ్చిదైప్పదు అప్పోదొరు శిన్దై శెయ్‌దే” ఎన్గిఱపడియే తమ్ముడైయ తాదాత్మికప్రతిభైయాలే “ప్రతివాదివారణప్రకటాటోపవిపాటన”త్తుక్కుమ్, “నూఱు తడావిల్ వెణ్ణైయుమ్”, నూఱుతడా అక్కార వడిశిలైయుమ్ నాచ్చియార్ మనోరథిత్తపడియే పరమస్వామియాన అ*ళ*కరుక్కు అముదుశెయ్ దరుళ ప్పణ్ణుకైక్కుమ్, తురుష్కన్‌పడైవీట్టిలే శెన్ఱు, అవన్ మాళికైయిలే ఇరుక్కిఱ రామప్రియరై “వరుక వరుక వరుక విఙ్గే వామన నమ్బీ! వరుక విఙ్గే, కరియకు*ళ*ల్చెవ్వాయ్ ముకత్తేన్ కాకుత్త నమ్బీ! వరుక విఙ్గే” ఇత్యాదియాలే**

---

ఆర్తి – అనగా భక్తి) అనియును నాయకి సూక్తులతో, తమ సూక్తులతో తమ ఆర్తిని తెలుపుటకును తగినవై (చాలినవై) యుండుటచే విశదతమములై యుండును.

భగవద్రామానుజుల జ్ఞానభక్తులు **“భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా”** (పరమాత్మయందు నాజ్ఞానము భక్తిరూపాపన్నమై, స్థిరముగా ఉండుగాక) అని తామును, **“అచ్యుతపదాంబుజయుగ్మరుక్మవ్యామోహతః”** (అచ్యుతుని పదాంబుజద్వంద్వ మనెడి బంగారమునందలి వ్యామోహమువలన) అని కూరేశులును అనుగ్రహించు నట్లున్నవై, గద్యత్రయ–శ్రీభాష్యములద్వారా శరణాగతిశాస్త్రము, భక్తిశాస్త్రములను క్రమముగా వ్యక్తీకరించుటకును, **“అవ్వ*ళి*యిల్ మఱ్ఱైయిల్ శేరాదవరై చ్చిదైప్పదు అప్పోదొఱు శిన్దై శెయ్‌దే”** (ఆ మార్గమున శాస్త్రములో చేరనివారిని నిర్జించుటకు అపుడు ఒక ఆలోచనను చేసియే) అనునట్లు తమ తాదాత్మిక (అప్పటి) ప్రతిభచే ప్రతివాదులనెడి గజముల గొప్ప గర్వమును బ్రద్దలు చేయుటకును, నూఱు గంగాళముల వెన్నను, నూఱు గంగాళముల అక్కారవడిశిల్ (పాల పాయసము) ను ఆణ్డాళ్ ఆశపడినరీతిలోనే పరమస్వామియగు సుందబాహుస్వామికి ఆరగింపు చేయుటకును, తురుష్కుని రాజ ధానికి వెడలి (ఢిల్లీచేరి), అతని భవనములోనున్న రామప్రియులను **“వరుక వరుక వరుక విఙ్గే వామన నమ్బీ! వరుక విఙ్గే, కరియకు*ళ*ల్చెవ్వాయ్ ముకత్తేన్ కాకుత్తనమ్బీ! వరుక విఙ్గే”** (వామనమూర్తీ! రమ్ము!



**తామే ఎ*ళు*న్దరుళి అ*ళై*క్క, అవర్ తమ్మరుకే ఓడియోడి విరైన్దోడి వన్దదాల్ – “ఎన్ శెల్వప్పిళ్లాయ్! వారాయ్!” ఎన్ఱు అవరుక్కు త్తిరునామమ్ శా*ఱ్ఱి*, తన్దిరుమార్విలే యణైత్తుక్కొళ్ళుకైక్కుమ్, పు*ళు*వన్ పట్ట వృత్తాంతత్తై తిరుక్కల్యాణిక్కరైయిలే తమ్ సన్నిధియిలే వన్దు మాఱొన్ఱిల్లా మారుతియాణ్డాన్ విణ్ణప్పమ్ శెయ్యక్కేట్టు, పెరియ ప్రీతియోడే “శెఙ్గోలుడైయ తిరువరఙ్గచ్చెల్వనా” రాన పెరియపెరుమాళై మఙ్గళాశాసనమ్ పణ్ణువదాక కోయిలుక్కె*ళు*న్దరుళుమ్బోదు తామోర్ ఐమ్బత్తిరువరై “శెయల్ నన్ఱాక త్తిరుత్తి”, తద్విషయత్తిలే పరివరాయిరుక్కుమ్పడి నియమిక్కైక్కుమ్, కరైకట్టాక్కావేరిపోల క్కరైపురణ్డు ఆశ్రయిత్త అళవన్ఱిక్కేయిరుక్కైక్కుమ్ ఉడలాయిరుక్కైయాలే విశదతమఙ్గళా యిరుక్కుమ్.**

**శ్రీమన్నాథమునికళుడైయవుమ్, ఆళవన్దారుడైయవుమ్ జ్ఞానభక్తికళ్ ఇఙ్గనే విశృంఖలమాయ్ క్కరైపురణ్డు యిరామే యఱైయాఱుపట్టు తాన్దామ్ ఆశ్రయిత్తవళవిలే దానేయడఙ్గి, ఒన్ఱిరణ్డు ప్రబంధఙ్గళైయే ఇట్టరుళుకైక్కుడలాయిరుక్కైయాలే విశదతరఙ్గళా యిరుక్కుమ్.**

---

రమ్ము! రమ్ము! ఇచటకు రమ్ము, నల్లని కురులను, ఎఱ్ఱని అధరమునుకల ముఖమును కల్గిన నా కాకుత్థస్వామీ! ఇచటకు రమ్ము) ఇత్యాదిగా తామే వేంచేసి పిలువగా, వారు తమసమీపమునకు పఱుగెత్తుకొని వచ్చుటచే, **“ఎన్‌శెల్వప్పిళ్లాయ్! వారాయ్!”** (నా సంపత్కుమారా! రమ్ము) అని వారికి పేరు పెట్టి తమ వక్షఃస్థలములో ఆలింగనము చేసికొనుటకు, క్రిమికంఠుడు మరణించిన వృత్తాంతమును కల్యాణి సరస్సుతీరములో తమ సన్నిధికివచ్చి మాఱొన్ఱిల్లామారు తియాణ్డాన్ అను ఆచార్యులు విన్నపించగా విని, మిక్కిలి ప్రీతితో **“శెఙ్గోలుడైయ తిరువరఙ్గచ్చెల్వనార్”** (అధికారదండమును కల శ్రీరంగనాథుడు) అగు పెరియ పెరుమాళ్‌ను మంగళాశాసనము చేయుటకు శ్రీరంగమునకు వేంచేయు నపుడు తాము యాబది రెండుమంది భక్తులను సంస్కరించి, రామప్రియుల విషయమున భక్తిని కలవారగునట్లు వారిని నియమించుటకును, తీరమును మించి ప్రవహించు కావేరివలె అవధిని మించి, ఆశ్రయించిన వారి అవధివరకేకాక, (వారి సంబంధమును కలవారివరకు యుండుటకు కారణమై) యుండుటచే విశదతమ ములై యుండును.

శ్రీమన్నాథమునులయొక్కయు, శ్రీయామునులయొక్కయు జ్ఞానభక్తులు ఇట్లు విశృంఖలములై, తీరమును దాటియుండునవికాక, తీరములోపలే అణగియుండు

**ఉయ్యక్కొణ్డారుడైయవుమ్, మణక్కాల్‌నమ్బియుడైయవుమ్, పెరియనమ్బి యుడైయవుమ్ జ్ఞానభక్తికళ్ కీ*ళ్*చ్చొన్నపడియిరాదే శినైయాఱుపట్టు పరిమితఙ్గళా యిరుక్కైయాలే విశదఙ్గళాయిరుక్కుమ్.**

**ఇప్పడి పదిన్ మూన్ఱు వాక్యఙ్గళిలుమ్ మున్దిన వాక్యఙ్గళ్ మూన్ఱుమ్ వేదమాకిఱ శాస్త్రరుచిపరిగృహీతఙ్గళాయిరుక్కుమ్. మ*ఱ్ఱై* వాక్యఙ్గళ్ పత్తుమ్ ఆచార్యరుచిపరిగృహీ తఙ్గళాయిరుక్కుమ్.**

**అపౌరుషేయమాయుమ్, పౌరుషేయమాయుమ్ ఇరుక్కిఱ రహస్యత్రయత్తుక్కుమ్ ఏకావయవిత్వమ్ శొన్నవోపాది, ఇప్పడి అపౌరుషేయమాయుమ్, పౌరుషేయమాయుమ్ ఇరున్దుళ్ళ ఇప్పదిన్‌మూన్ఱు వాక్యత్తుక్కుమ్ ఏకావయవిత్వమ్ శొల్ల త్తట్టిల్లై.**

**అప్పడియే, "నమో ఋషిభ్యః" మున్నాక ఎన్ఱాప్పోలే నమశ్శబ్దమ్ మున్నాక ఇవ్వాక్యత్రయత్తైయుమ్ నిర్దేశియాదే అస్మచ్ఛబ్దమ్ నిర్దేశిత్తదు "అఖిలభువనజన్మ" ఎన్గిఱ విడత్తిప్పోలే మఙ్గళోక్తమాన అకారోపక్రమత్వసిద్ధ్యర్థమాక.**

---

నదివలె తాము ఆశ్రయించిన అవధిలోనే అణగియుండి, ఒకటి రెండు ప్రబంధములను మాత్రమే అనుగ్రహించుటకు తగినవై యుండుటచే విశదతరములై యుండును.

ఉయ్యక్కొణ్డార్‌యొక్క, మణక్కాల్‌నమ్బియొక్క, పెరియనమ్బియొక్కయు జ్ఞానభక్తులు పూర్వము తెల్పిన రీతిలో కాక ఎక్కువ నీటిని కల్గియుండని నదివలె పరిమితములైయుండుటచే విశదములైయుండును.

ఇట్లు పదమూడు వాక్యములలో ముందు వాక్యములు మూడును వేదమనెడి శాస్త్రమునందలి రుచిచే (ప్రీతిచే) పరిగృహీతములైయుండును; మిగిలిన వాక్యములు పదియు ఆచార్యరుచిపరిగృహీతములై యుండును.

అపౌరుషేయమై, పౌరుషేయమైయున్న రహస్యత్రయమునకును ఏకావయవిత్వము చెప్పు రీతిలోనే ఇట్లు అపౌరుషేయమై, పౌరుషేయమైయున్న ఈ పదమూడు వాక్యములకు ఏకావయవిత్వమును చెప్పుటలో అడ్డు లేదు.

అట్లే, **"నమో ఋషిభ్యః"** అనునట్లు నమశ్శబ్దపూర్వకముగా ఈ వాక్యత్రయమును నిర్దేశింపకుండ, అస్మచ్ఛబ్దపూర్వకముగ నిర్దేశించుట ఎందులకనగా – **"అఖిలభువన జన్మ"** అను శ్రీభాష్యప్రారంభములోని మంగళమువలె అకారముతో ప్రారంభించుట (సిద్ధించుట) కొఱకు.



**అప్పడియే మున్దిన వాక్యత్తై అకారోపక్రమసిద్ధ్యర్థమాక అస్మచ్ఛబ్దత్తై మున్నిట్టు నిర్దేశిత్తవోపాది, మ*ఱ్ఱై* యిరణ్డు వాక్యఙ్గళైయుమ్ అస్మచ్ఛబ్దత్తై త్తానే మున్నిట్టు నిర్దేశిత్తదుమ్, "శం నో మిత్రః శం వరుణః శ న్నో భవత్వర్యమా" ఎన్నుమాప్పోలే.**

**త్రయోదశవాక్యాత్మకమాన విగ్గురుపరంపరారూపమాలామంత్రన్దాన్ శ్రీసహస్ర నామమాలామంత్రమ్‌పోలే అనేకనమశ్శబ్దశరీరకమాయ్, ద్వారశేషికళుక్కుమ్, ప్రధానశేషికళుక్కుమ్ ప్రతిపాదకమాయ్, ప్రథమమధ్యమచరమావధిస్వరూపమాన పర్వత్రయప్రకాశకమాయ్, ఉపదేష్టృ–ఉపదేశ–ఉపదేశ్యరూప మూన్ఱువర్గత్తుక్కుమ్ సాంప్రదాయిక సాద్గుణ్యయోగ్యతైకళుక్కుమ్ సంపాదకమాయ్, "వక్తవ్యమ్ గురుపరంపరైయుమ్, ద్వయముమ్" ఎన్గైయాలే ద్వయత్తోపాది సదాఽనుసంధేయ మాయ్, తన్నై మున్నిట్టు అనుసంధిప్పారై "నావకారియమ్" శొల్లిలాదవర్ ఎన్ఱు మయర్వఱ మదినల మరుళప్పె*ఱ్ఱా*ర్ కొణ్డాడుమ్‌పడి పణ్ణక్కడవదాయ్, అస్మత్ ఎన్ఱు**

---

అట్లే, ముందు వాక్యమును (మొదటి వాక్యమును) అకారముతో ప్రారంభింప బడుట సిద్ధించుటకొఱకు అస్మచ్ఛబ్దపూర్వకముగా నిర్దేశించిన రీతిలోనే, మిగిలిన రెండువాక్యములను అస్మచ్ఛబ్దపూర్వకముగా నిర్దేశించుటయును, (ఎట్టిది? అనగా)– **"శం నో మిత్ర శ్శం వరుణః శం న్నో భవత్వర్యమా"** అనునపుడు **'శం నో'** అను మంగళవాచకముతో మొదట ప్రారంభించి పిమ్మట ఆ మంగళవాచకముతోనే మిగిలిన వాక్యములనుకూడ ప్రారంభించుట వంటిది.

పదమూడువాక్యముల రూపములోని ఈ గురుపరంపరారూపమైన మాలా మంత్రము శ్రీసహస్రనామమాలామంత్రమువలె అనేక నమశ్శబ్దములను కల్గినదై, ద్వారశేషిభూతులకు (ఆచార్యులకును), ప్రధానశేషిభూతులగు లక్ష్మీనారాయణులకును ప్రతిపాదకమై ప్రథమ–మధ్యమ–చరమపర్యంత స్వరూపమైన పర్వత్రయ(భగవద్భాగవత ఆచార్య) ప్రకాశకమై, ఉపదేశించువాడు – ఉపదేశింపబడునది – ఉపదేశింపబడువాడు అను మూడు వర్గములకు, సాంప్రదాయికత్వములను, సద్గుణములను, యోగ్యతను కల్గించునదియై, **"వక్తవ్యమ్ గురుపరంపరైయుమ్, ద్వయముమ్"** (గురుపరంపర, ద్వయమంత్రమును అనుసంధింపతగినవి) అనుటచే ద్వయమువలెనే సదా అనుసంధేయమై, తనను పురస్కరించువారిని **"నావకారియమ్"**ను పలుకనివారు అని, **"మయర్వఱమదినలమ్"** (భ్రమవిప్రలంభాదిదోషరహితమైన, భక్తిరూపాపన్నజ్ఞానమును పొందినవారు) కీర్తించురీతిలో చేయునదియై, **"అస్మత్"** అని అకారముతో ప్రారంభమై,

**అకారాదియాక ఉపక్రాంతమాయ్, అప్పడియే అకార శ్రీమత్ శబ్దఙ్గళై ప్పలవిడఙ్గళిలుమ్ ఇడైయిలే ఉడైత్తాయ్, "శ్రీధరాయ నమః" ఎన్ఱు మాంగలికమాన నమశ్శబ్దత్తోడు నిగమిక్కప్పట్టదాయ్ ఇరుక్కైయాలే కార్స్న్యేన మంగళాత్మకమాయ్ ఇరుక్కుమ్.**

**వాక్యగురుపరంపరావ్యాఖ్యానమ్ సంపూర్ణమ్**

**శ్రీపిళ్లైలోకమ్‌జీయర్ తిరువడికళే శరణమ్**



---

అట్లే అకార–శ్రీమత్ శబ్దములను పలుచోట్ల మధ్యలో కల్గినదై, **"శ్రీధరాయ నమః"** అని మంగళాత్మకమైన నమశ్శబ్దముతో పూర్తిచేయబడినదైయుండుటచే పూర్ణముగా మంగళాత్మకమైయుండును.

వాక్యగురుపరంపరావ్యాఖ్యానము ఆంధ్రీకరణం సంపూర్ణము

శ్రీపిళ్లైలోకమ్‌జీయర్ తిరువడిగళే శరణము

